# చిత్తరంజనదాసుగారి

## జీవితచరిత్రము.

శ్రీ పునుగు. శ్రీకంఠము, బి. ఏ.,
గారిచే విరచితము.

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
ప్రకటితము.
1923

# దేశబంధు

# చిత్తరంజనదాసుగారి

## జీవితచరిత్రము.

శ్రీయుత చిత్తరంజన దాసుయొక్క పూర్వీలుండిన విక్రమపురము తూర్పు బంగాళా దేశమునకు ఆభరణాయమానంబై పద్మ, మేఘునా నదులచే నావృతమై యొప్పారుచున్నయది. ఇయ్యది ఒకానొకప్పుడు సింహాళము, సుమిత్ర దీవులతోను అరేబియా దేశముతోను విస్తారముగ వ్యాపారము సలుపుచుండు వర్తకులకు నెలవై యుండెను. చీనా దేశమునందుండి భారత దేశమున బౌద్ధమతౌన్నత్యమును కన్నులారగని యానందించుటకువచ్చిన హాయ్యూన్ త్సాంగునకుపాధ్యాయుఁడైన బ్రాహ్మణరాజు శిలానద్రుఁడు జన్మించిన దిచ్చోటే. సుప్రసిద్ధనాస్తికమతోపాధ్యాయుఁడగు దీపాంకుర శ్రీజ్ఞానుఁడుపుట్టినదిక్కడనే. నాలందలో ప్రశస్తిగాంచియుండినబుద్ధదేవాలయపు విఖ్యాతిఁజెందిన పూజారి వీరభద్రుఁ డనువాఁడు నైతమందే పుట్టెను. ఈవిక్రమపురమునకు 'తెలిర్‌బాగ్' అను చిన్నగ్రామము మజరాగా నున్నది. ఈపల్లెయే స్వార్థత్యాగపరాయణుఁడును, దేశబంధువును, విశేష శేముషీయుతుఁడును, కలకత్తా న్యాయ

వాదులలో నగ్రగణ్యుఁడును నైన చిత్తరంజనదాసు గారి పూర్వులుండిన స్థానము. చిత్తరంజనుని ప్రపితామహుఁడు బాబురత్నకృష్ణదాసు అతిధార్మికుఁడు. ఈరత్నకృష్ణదాసు కుమారులలో జ్యేష్ఠుఁడు జగద్బంధుదాసుఁడు రాజషాహీలో గవర్నమెంటు ప్లీడరై యుండి మిక్కిలి ఖ్యాతిగడించెను. తాను గడించిన ద్రవ్యమునంతయు బీదలపాలు జేయుచు అడిగినవారికి లేదనక ఉపకరించుచు దానకర్ణుఁడను కీర్తిపొందెను ఈజగద్బంధుదాసుఁడు. అంతేగాక, కవులకు విద్వాంసులకు సైతమీతఁడు కల్పవృక్షమై యుండెను. ఈతని సద్గుణములె మన చిత్తరంజనుని యందు నెలకొనినవి. చిత్తరంజనునితండ్రి తండ్రి బాబు భువనమోహనదాసు. ఈతఁడును కలకత్తా హైకోర్టునందు అటర్నీ వృత్తిని స్వీకరించి న్యాయవాదియై ఖ్యాతిగాంచెను.

భువనమోహనుఁడు వృత్తియందు న్యాయవాదియైనను దేశక్షేమమునకై హృదయపూర్వకముగ పాటుపడవలయునను సంపూర్ణోద్దేశము కలవాఁడు. బ్రహ్మసమాజోద్యమాభివృద్ధికి తన యావత్తుశక్తిని వినియోగించుచుండెను.

న్యాయవాదవృత్తియందు విస్తారధనము నీతఁడు గడించి బీదలగు తనచుట్టాలకై యాధనమును

వెచ్చించుచుండినందున చేత నొక్కకాసైనను నిలువనుంచికొన్నవాఁడు కాఁడు. ఇట్లు ఆర్జించిన ద్రవ్యమునంతయు వెచ్చించి అప్పులపాలై వృద్ధాప్యమునందు ఇన్సాల్వెంటని హైకోర్టుగుండా పత్రమును బొందిఅప్పులవారిబాధను తొలగించికొనవలసినవాఁడయ్యెను.

## బాల్య దశ.

ఇట్టి సుప్రసిద్ధన్యాయవాదులయొక్కయు, దానౌదార్యగుణయుతులయొక్కయు వంశమున కలకత్తానగరమున భువనమోహానునకు 1870-వ సం॥ నవంబరు ౫-వ తేదినాఁడు మన కథానాయకుఁడు చిత్తరంజనుఁడు జన్మించెను. శైశవము గడింపగానే చిత్తరంజనుఁడు భవానిపురమునందుండు లండన్ మిషనెరీ సొసయిటీ స్కూలునందు చేరి 1886-వ సంవత్సరము ప్రవేశపరీక్షయందుత్తీర్ణుఁడయ్యెను. పిదప కలకత్తా ప్రెసిడెన్సీకాలేజి ప్రవేశించి 1890-వ సంవత్సరము బి. ఏ. పట్టము నొందెను. వెంటనే ఇండియన్ సివిల్ సర్వీసు ఉద్యోగ పరీక్షనిచ్చుటకు ఇంగ్లాండుకు తర్లెను. సివిల్ సర్వీసు పరీక్షాపత్రములను వ్రాసి ఫలితమునకై వేచియుండఁగా భారతపితామహుఁడు సుప్రసిద్ధ దాదాభాయినౌరోజీ పార్లమెంటు సభ్యుఁడగుటకు యత్నములు సేయు

చుండెను. ఆయుద్యమమున చిత్తరంజనుఁడు పాల్గొని అనేక రాజకీయోపన్యాసముల గావించి యశస్సు గాంచెను. ఇట్లుండ ఒకానొక పార్లమెంటు మెంబరు రోనాల్డు మెక్నీలనువాఁడు భారతమహమ్మదీయులను బానిసలనియు, హిందువులు నిబంధనలపద్ధతి ననుసరించు బానిసలనియు దూషించగా చిత్తరంజనుఁడు ఆదూషణకు సహించక ఒకగొప్ప సభాసమావేశము గావించి ఆసభలో మెక్నీను అవసరపడి చెప్పిన మాటయందు తెలివి తక్కువను గన్పించినదే కాని మరియే అన్యమును కానరాదని ఒకతీర్మానమును చేసెను. ఇంగ్లాండునందు పత్రికలు ఈతీర్మానమునకై గొప్ప ఆందోళనము జేసెను. ఈయాందోళనాఫలితముగ వేరొకసభ లిబరల్ కక్షవారు గావించి దానికి గ్లాడ్స్టను మహామంత్రిగారిని అధ్యక్షులుగా జేసి ఆసభలో చిత్తరంజనుని హిందూదేశపుస్థితిగతులనుగుఱించి యుపన్యాసమును గావింపమనిరి. ఆసమయమున తనవాగ్ధోరణిని, యుక్తియుక్తమును, చాతుర్యమును, దేశభక్తియుతమును నైనదానిని ఆసభవారికి మిక్కిలి ధైర్యముతో దెలుపుచు "పార్లమెంటుసభలో సభ్యులు పలుమారు భారతదేశమును ఆంగ్లేయులు తాము ఆయుధబలిమిచే జయించిరనుటయు, దానిని కృపాణప్రయోగ

ముననే కాపాడవలయు ననుటయు పొరబాటు. వారు భారతదేశమును నీతిబలముచే సాధించిరి. బాహుబలమున సాధించినామనుట బొల్లు. ఈమాటలను వినుట భారతీయునకు మిక్కిలి వ్యథగానుండును. ఇట్లు వచించుట ఆంగ్లేయునకు కడునీచమైయుండును." ఈమాటలాసభ్యులమనసున కెక్కిమెక్లీనును తనపొరపాటుకై పార్లమెంటు సభ్యత్వమునకు నిర్బంధముగా రాజీనామా నొసంగునట్లు చేసినవి.

ఈయాందోళనము నంతయు ఇంగ్లాండునందలి నిరంకుశాధికార దొరతనపువర్గము కనిపెట్టుచుండి సివిల్‌సర్వీసు పోటీ పరీక్షలలో జయముగాంచుటకు వలయునన్ని గుణములకంటె ఎంతో హెచ్చుగా వచ్చియుండియు, చిత్తరంజనుని పేరు విజయమునొందిన వారిపేర్ల పట్టీలోనుండి తొలగించిరి. ఈయపజయము చిత్తరంజనుని కుటుంబమున విపరీత అశాంతిని గలుగఁజేసినది. కుటుంబస్థితి మిక్కిలి దుర్దశలో నుండెను. పరీక్షలో జయము నొందియుండినచో ఇండియాదొరతనమున నేదో గొప్పయుద్యోగము లభించి కుటుంబమునకు జీవనాధారమేర్పడియుండునని కుటుంబమువారు తలంచిరి. అయితే విధిని ఎవరు తప్పింపఁగలరు? వెంటనే చిత్త

రంజనుఁడు ధైర్యముచేసి బారిస్టరుపరీక్షకు చదువుటకై యత్నించెను. ఈదినములలో చిత్తరంజనునకు చేత కాసులేక కొన్నాళ్లు ఉత్తనీళ్లుద్రాగి కాలక్షేపము చేయవలసినవాఁ డయ్యెను.

## న్యాయవాదవృత్తి.

ఆంగ్లేయభాషలో సాహిత్యమును విశేషముగ గడించినవాఁడు కావున ఉపాధ్యాయవృత్తిని స్వీకరించవలయునని మాత్రము అభిలాష చిత్తరంజనునికి మెండు. అయితే, ఈవృత్తివలన విశేషధనమార్జించుటకు వలను లేదనియు, ధనమార్జించి ఎట్లైనను తండ్రి ఋణవిమోచనము గావింపవలయునను ఉద్దేశము ఎక్కువగా నుండుటచే విధిలేక న్యాయవాదవృత్తిని 1893-వ సంవత్సరమున కలకత్తా హైకోర్టులో స్వీకరించెను. తండ్రి అప్పులనంతయు తానొప్పుకొని వానినంతయు చెప్పిన గడువు ప్రకారము ఇయ్యలేకపోవుటచే తానును ఇన్‌సాల్వెన్‌సీ పత్రమునకై పిటీషన్ కోర్టులో పెట్టవలసినవాఁడయ్యెను. ఎట్టివానికిని ఏవృత్తియందును మొట్టమొదట విశేషధనము గడించగల అదృష్టము పట్టనేరదు. చిత్తరంజనుఁడు తన అపారమగు ధీశక్తిని చూపుటకు కాలము ఇంకను తటస్థించ లేదు.

విస్తారమైన తెలివి ఎన్నటికిని దాగియుండనేరదు. దానివేంద్రమును అదిసమయము వచ్చినప్పుడుచూపి యేతీరును.

1907, 1908-వ సంవత్సరములలో బంగాళమున నూతన ప్రబోధ మొకటి పొడమెను. బంగాళీలు దీర్ఘనిద్రనుండి లేచిరి. ఎటుజూచినను వారికి ఐరోపి యను వస్తువంతె అసహ్యమైనది. కర్జన్ ప్రభువు ఆకాలపు ఇండియా వైసిరాయిగారు. వారి ప్రభుత్వ విధానమంతయు బంగాళీలకు నచ్చలేదు. స్వరాజ్యో ద్యమము, జాతీయ విద్యాప్రారంభము, విదేశవస్తు బహిష్కారము ఈమూటికిని బీజము లాకాలము లోనే బంగాళాయందు అంకురించినవి. మనదేశ ములో ఏదిపుట్టినను మొట్టమొదట బంగాళములో పుట్టవలయును. ఆర్యావర్తమునుమా! అది. ఋషులు వేదాలు పాడినది అక్కడ. జ్ఞానులు ఉపనిషత్తులు చెప్పినది అక్కడ. శాస్త్రులు శాస్త్రాలు రచించినది అక్కడ. కవులు కావ్యాలు వ్రాసినది అక్కడ. సర స్వతీమందిరాలు ఉన్నవి అక్కడ. విద్యాపీఠాలు వెలసినవి అక్కడ.

పై యుద్యమములు మూడును ప్రారంభింపఁగా నే నిరంకుశాధికారవర్గము నిర్బంధ విధానములకు

ప్రారంభించి నిరపరాధులగు ఉద్యమనాయకులపై ఏవో నెపములనిడి వారిపై అభియోగములను తెచ్చినది. మహామేధావి, జ్ఞానియైన అరవిందఘోషు జాతీయోద్యమనాయకుఁడు. మఱికొందఱు యువకులతో కూడ నిర్బంధ విధానమునకు లోబడవలసిన వారైరి. నిందితుల కేసును దొరతనపువారు పూర్ణముగ బలపరచిరి. నిందితపక్షమున వాదించుటకు మన చిత్తరంజనుఁడు పూనికొని తన దేశస్థులును, మహావిద్వాంసులు నైన అరవిందఘోషు వంటివారి చిక్కును వదలించుటకై కంకణము కట్టికొని ఈవ్యాజ్యమున తనకు ద్రవ్యలాభమే లేకపోయినను, డిఫెన్సువాదమునకు కావలసిన సాక్ష్యమును సిద్ధముచేయుటకే ఆఱునెలలు పట్టినది. వ్యాజ్యమా ఏడాది సాగినది. ఈలోపుగా ఇంటి సామాన్యఖర్చులకు కూడ చేత పైకము లేక పోయినది. పట్టుపట్టి నేర్పుతో వాదించి అరవిందఘోషుని నిర్దోషి యనిపించెను. ఇందువలననే ఈతఁడు కలకత్తా న్యాయవాదులలో నగ్రగణ్యుఁ డాయెను. న్యాయమూర్తులు తోటి న్యాయవాదులు ఎల్లవారును చిత్తరంజనుని బుద్ధికౌశలము నెఱింగిరి. పిదప డక్కా రాజద్రోహనేరమున నిందితులతట్టు వాదించి వారిని నిర్దోషు లనిపించి విడుదల గావిం

చెను. అప్పటినుండి ఆయన ఇంటినుండి పెద్దమ్మ తొలఁగి చిన్నమ్మ కాపురము కుదుర్చుకొన సాగెను.

తనతండ్రిగారి ఋణములను తాను దీర్చెదనని ప్రథమమున పూనికొని తీర్చలేక ఇన్సాల్వెంటు పత్రమును దాఖలుచేసె ననియు, అట్లు చేయుటచే అప్పులవారిని మోసపుచ్చి కృతార్థుఁడు కావలయు ననుట కాదని ఇదివరలో వ్రాసియుంటిమి. ఇప్పుడు ధనము చేకూరసాగగా తనపూర్వపు అప్పులవారందరి నందఱను గూర్చి వారివారి కాతేదివర కచ్చవలసిన వడ్డితోటి అసలు పైకమంతయు నిచ్చి పితౄణము నుదీర్చి కృతార్థుఁ డయ్యెను. ఇట్టి చర్య కద్భుతపడి ప్లెచ్చరు అనున్యాయమూర్తి విడుదల కాఁబడిన ఇన్సాల్వెంటు తనపాత బాకీల నొప్పికొని వాటిని వడ్డీసహా తీర్చుట చోద్యమనియు, ఇట్లు తీర్చిన చిత్తరంజనునివంటివానిని తాను చూచుట కిదియే ప్రథమమనియు బహిరంగమైన న్యాయస్థానమున నుడివెను. ఈయద్భుతమైన చిత్తరంజనునిచర్య వానిని మహానీతిపరుఁడుగను లోకోత్తరుఁడుగ నెన్నికొనుస ట్లొనర్చినది.

కలకత్తా హైకోర్టు కేసు లన్నింటిలో నొకతట్టు వాదము చిత్తరంజనునిదిగా లేని కేసేదియు లేదు. ఇట్టి విస్తారకార్య మగ్నుడై యుండుకాలమున నెల

1-కి సుమారు 50-వేల రూప్యములను గడించుచుం
డెను. బంగాళారాష్ట్రమునందే గాక ఇతరరాష్ట్రముల
యందు ననేక వ్యాజ్యములలో వాదించి శిక్షనొంద
సిద్ధముగ నున్న వారిని విడుదలగావించెను. ఏవ్యాజ్య
మున నేతట్టుబూనికొన్నను ఆతట్టు తనయావచ్ఛ
క్తిని వినియోగించి తనపక్షముయొక్క విజయము
నకై పోరాడును. వ్యాజ్యమును వాదించునపుడు
పరమేశ్వరునిగురించి ధ్యానించు యోగివలె గాన్పిం
చునుగాని న్యాయవాదిగ గాన్పించఁడు. ఆతని
కియ్యఁబడిన ఫీజును ఆతఁడు మరల కక్షిదార్ల కియ్య
నవసరములేదు. కాని, ధర్మాధర్మముల నాలోచించి
తానెంతవఱకు ధనమును కైకొనవలయునో అంత
మాత్రమే పుచ్చుకొని మిగిలినదానిని కక్షిదార్లకు
మరల నిచ్చివేయుచుండువాఁడు. ఈకార్యమువల్ల
కక్షిదార్లచే భాగ్యకు మిక్కిలి పాత్రుఁడయ్యెను.
బీదవారి కేసులను ధనము కైకొనకయే వాదించు
వాఁడు. ఇట్టి కార్యములచే కీర్తి నొందయ్యెను.
చిత్తరంజనుఁడు ఇన్నివ్యాజ్యములను వాదించుచుం
డియు సమయము తటస్థించినపుడెల్లను స్వరాజ్య
మును గురించి ప్రసంగించువాఁడు. నాగపురమున
కొక వ్యాజ్యసందర్భమున నేగియుండి ఆవ్యాజ్య
మున తనకు ధనమేమియు విస్తారము రాకున్నను

అచ్చటనుండిన హోంరూల్ సంఘమునకు విస్తార ధనము నొసంగి తన అసాధారణ ఔదార్యమును నాగపురవాస్తవ్యులకు దెలిపెను. ఇట్లే రంగూను కేగి హిందూదేశరక్షక చట్టముక్రింద నిందితుండైన తనమిత్రుండు మెహెతాగారితట్టు వాదించి వారిని విడుదల చేయించుకొని వచ్చెను. వేయేల? ఉదాహరించినచో నిట్టి వనేకములను చిత్తరంజనుండు పూని కొన్ని వాదించెను. ఈతండు అతివాదియైనను, సత్యసంధుండని సర్కారెటింగి మ్యునిషను బోర్డువ్యాజ్యమున నీతనిని సర్కారువారు తమతరఫు న్యాయవాదిగ నేర్పఱచికొనిరి. ఎదుటిపక్షపువర్తకులు లక్షలకొలది ధనము తనకొసగుటకు యత్నములం గావించినను ఆసందర్భమున చిఱునవ్వునవ్వి దొరతనమువారితట్టు తాను వకాలతుతీసికొని ఆవర్తకు లిచ్చుధనమును గైకొని వారిని నిర్దోషులనిచెప్పి వ్యాజ్యమును కప్పిపుచ్చుటకంటె అధర్మప్రవర్తన వేఱొండుండ నేరదనెను. చిత్తరంజనుండు అవమానము నెంతమాత్రము సహించనేరండు. మోమోటములేక న్యాయస్థానమున నిట్టిదేదైనను జరిగినచో వెంటనే న్యాయమూర్తితో మండలించును. అప్పటికిని న్యాయము కలుగనిచో కోర్టునుండి తాను వెడలివచ్చువాండు. డక్కా రాజద్రోహ కేసులో

నిట్టి సందర్భమున కోర్టును వెడలివచ్చెను మన చిత్త
రంజనుడు. మఱియు ననేక కేసులను ధనము పుచ్చు
కొనకయే వాదించుచుండినను నెలకు విస్తారధన
మును సుమారు 50-వేల రూప్యములను గడించు
చుండువాఁడు. ఎంతో స్వార్థత్యాగ మొనర్చి రాజ
కీయ కేసులలో నిందితుల పక్షమున ధనమును గైకొ
నకయే వాదించును. పంజాబువిచారణ సంఘము
నందు నాల్గునెలలు కృషిసల్పి తనస్వార్థత్యాగ
పరాయణత్వమును గాన్పించెను. దేశసేవచేయవలసి
వచ్చినప్పుడు తన అత్యధికమైన ఆదాయమును
తటాలున వదలుకొని ప్రజలవేనోళ్ల పొగడ్తలకు
పాత్రుఁడయ్యెను.

బంగాళాసారస్వతము - చిత్తరంజనుని సేవ.

చిత్తరంజనుఁడు రాజకీయ విషయములలో
ప్రవేశించుటకు బహుకాలమునకు మునుపే బంగా
ళావాఙ్మయమును వృద్ధిపొందించుటలో నాతని
మేధాకౌశలమును వెల్లడించెను. 1895-వ సంవత్సర
ముననే బంగాళా భాషలో 'మలంకా' అనుగీతముల
నాతఁడు రచించెను. ఈగీతములు వంగీయులకు
స్వాభావికముగనే స్వాతంత్ర్యాభిలాషను జనింపఁ
జేసినవి. 'మలంకా'లో కొన్ని గీతములు నాస్తికవా
దమును బలపరచుచుండినదని చిత్తరంజనుని మీఁద

బ్రహ్మసమాజమువా రప్రియమును జూపిరి. మలంకా గీతములను రచించిన వెనుకనే 1897-లో చిత్తరంజ నునకు వివాహ మయ్యెను. మలంకా గీతముల భావ ములకు బ్రహ్మసమాజాధ్యక్షుండై యుండిన పండిత శివనాథశాస్త్రి, అనేకులగు బ్రహ్మసామాజికులు కినిసి వీరి వివాహమునకు గూడ జనరైరి. 'మలంకా' రచనకు పిదప 'మాల', 'అంతర్యామి', 'కిశోరకి శోరి', 'సాగరసంగీతము'లను నాల్గుగీతములను చిత్త రంజనుఁడు రచించెను. ఈతని కవనధోరణి ఈనాల్గు గీతములలో వంగదేశమున విస్తరించెను. కొన్ని గీత ములు వంగీయుల కుగ్గుపాలతోఁ బోసిన వైష్ణవ సిద్ధాంతముల బయలుపరుచును. కొన్ని గీతములు మిక్కిలి శృంగారమును చిప్పిలఁజేయును. కొన్ని శోకరసమును దెల్పుచు నత్యద్భుతముతో పరమేశ్వ రుఁడెందున్నాఁడో యని వెదకు పరమభాగవతో త్త ముని హృదయమును వెల్లడి పరచును.

కాని, ఈగీతము లన్నింటిలో సుప్రసిద్ధి గాంచి నవి సాగరగీతములే. సంద్రమును వీక్షించగా నేయా తనిహృదయసీమఁ బొడమిన మనోహరము లగుత లంపు లత్యద్భుతముగా నీకావ్యగీతములలో వర్ణింపఁ బడియున్నవి. ఆరంభము మొదలు తుదవరకు ఘనత

1-కి సుమారు 50-వేల రూప్యములను గడించుచుండెను. బంగాళారాష్ట్రమునందే గాక ఇతరరాష్ట్రముల యందు ననేక వ్యాజ్యములలో వాదించి శిక్షనొంద సిద్ధముగ నున్నవారిని విడుదలగావించెను. ఏవ్యాజ్యమున నేతట్టుబూనికొన్నను ఆతట్టు తనయావచ్ఛక్తిని వినియోగించి తనపక్షముయొక్క విజయమునకై పోరాడును. వ్యాజ్యమును వాదించునపుడు పరమేశ్వరునిగుఱించి ధ్యానించు యోగివలె గాన్పించునుగాని న్యాయవాదిగ గాన్పించఁడు. ఆతనికియ్యఁబడిన ఫీజును ఆతఁడు మరల కక్షిదార్ల కియ్యనవసరములేదు. కాని, ధర్మాధర్మముల నాలోచించి తానెంతవఱకు ధనమును కైకొనవలయునో అంతమాత్రమే పుచ్చుకొని మిగిలినదానిని కక్షిదార్లకు మరల నిచ్చివేయుచుండువాఁడు. ఈకార్యమువల్ల కక్షిదార్లచే షౌగస్తకు మిక్కిలి పాత్రుఁడయ్యెను. బీదవారి కేసులను ధనము కైకొనకయే వాదించువాఁడు. ఇట్టి కార్యములచే కీర్తి నొందయ్యెను. చిత్తరంజనుఁడు ఇన్నివ్యాజ్యములను వాదించుచుండియు సమయము తటస్థించినపుడెల్లను స్వరాజ్యమును గురించి ప్రసంగించువాఁడు. నాగపురమున కొక వ్యాజ్యసందర్భమున నేగియుండి ఆవ్యాజ్యమున తనకు ధనమేమియు విస్తారము రాకున్నను

అచ్చుటనుండిన హోంరూల్ సంఘమునకు విస్తార ధనము నొసంగి తన అసాధారణ ఔదార్యమును నాగపురవాస్తవ్యులకు దెలిపెను. ఇట్లే రంగూను కేగి హిందూదేశరక్షక చట్టముక్రింద నిందితుండైన తనమిత్రుండు మెహతాగారితట్టు వాదించి వారిని విడుదల చేయించుకొని వచ్చెను. వేయేల? ఉదాహరించినచో నిట్టి వనేకములను చిత్తరంజనుండు పూని కొని వాదించెను. ఈతండు అతివాదియైనను, సత్యసంధుండని సర్కారెఱింగి మ్యునిషనుబోర్డువ్యాజ్యమున నీతనిని సర్కారువారు తమతరఫు న్యాయవాదిగ నేర్పఱచికొనిరి. ఎదుటిపక్షపువర్తకులు లక్షలకొలది ధనము తనకొసగుటకు యత్నములం గావించినను ఆసందర్భమున చిఱునవ్వునవ్వి దొరతనమువారితట్టు తాను వకాలతుతీసికొని ఆవర్తకు లిచ్చుధనమును గైకొని వారిని నిర్దోషులనిచెప్పి వ్యాజ్యమును కప్పిపుచ్చుటకంటె అధర్మప్రవర్తన వేఱొండుండ నేరదనెను. చిత్తరంజనుండు అవమానము నెంతమాత్రము సహించనేరండు. మోమోటములేక న్యాయస్థానమున నిట్టిదేదైననుజరిగినచో వెంటనే న్యాయమూర్తితో మందలించును. అప్పటికిని న్యాయము కలుగనిచో కోర్టునుండి తాను వెడలివచ్చువాండు. డక్కా రాజద్రోహ కేసులో

నిట్టి సందర్భమున కోర్టును వెడలివచ్చెను మన చిత్త రంజనుడు. మఱియు ననేక కేసులను ధనము పుచ్చుకొనకయే వాదించుచుండినను నెలకు విస్తారధనమును సుమారు 50-వేల రూప్యములను గడించుచుండువాఁడు. ఎంతో స్వార్థత్యాగ మొనర్చి రాజకీయ కేసులలో నిందితుల పక్షమున ధనమును గైకొనకయే వాదించును. పంజాబువిచారణ సంఘమునందు నాల్గునెలలు కృషిసల్పి తనస్వార్థత్యాగపరాయణత్వమును గాన్పించెను. దేశసేవచేయవలసివచ్చినప్పుడు తన అత్యధికమైన ఆదాయమును తటాలున వదలుకొని ప్రజలవేనోళ్ల పొగడ్తలకు పాత్రుఁడయ్యెను.

బంగాళాసారస్వతము - చిత్తరంజనుని సేవ.

చిత్తరంజనుఁడు రాజకీయ విషయములలో బ్రవేశించుటకు బహుకాలమునకు మునుపే బంగాళావాఙ్మయమును వృద్ధిపొందించుటలో నాతని మేధాకౌశలమును వెల్లడించెను. 1895-వ సంవత్సరముననే బంగాళా భాషలో 'మలంకా' అనుగీతముల నాతఁడు రచించెను. ఈగీతములు వంగీయులకు స్వాభావికముగనే స్వాతంత్ర్యాభిలాషను జనింపఁజేసినవి. 'మలంకా'లో కొన్ని గీతములు నాస్తికవాదమును బలపరచుచుండినవని చిత్తరంజనుని మీద

బ్రహ్మసమాజమువా రప్రియమును జూపిరి. మలంకా గీతములను రచించిన వెనుకనే 1897-లో చిత్తరంజనునకు వివాహ మయ్యెను. మలంకా గీతముల భావములకు బ్రహ్మసమాజాధ్యక్షుఁడై యుండిన పండిత శివనాథ శాస్త్రి, అనేకులగు బ్రహ్మసామాజికులు కినిసి వీరి వివాహమునకు గూడ జనరైరి. 'మలంకా' రచనకు పిదప 'మాల', 'అంతర్యామి', 'కిశోరకిశోరి', 'సాగరసంగీతము'లను నాల్గుగీతములను చిత్తరంజనుఁడు రచించెను. ఈతని కవనధోరణి ఈనాల్గు గీతములలో వంగదేశమున విస్తరించెను. కొన్ని గీతములు వంగీయుల కుగ్గుపాలతోఁ బోసిన వైష్ణవ సిద్ధాంతముల బయలుపరుచును. కొన్ని గీతములు మిక్కిలి శృంగారమును చిప్పిలఁజేయును. కొన్ని శోకరసమును దెల్పుచు నత్యద్భుతముతో పరమేశ్వరుఁడెందున్నాఁడో యని వెదకు పరమభాగవతోత్తముని హృదయమును వెల్లడి పరచును.

కాని, ఈగీతము లన్నింటిలో సుప్రసిద్ధి గాంచినవి సాగరగీతములే. సంద్రమును వీక్షించగా నేయాతనిహృదయసీమఁ బొడమిన మనోహరము లగుతలంపు లత్యద్భుతముగా నీకావ్యగీతములలో వర్ణింపఁబడియున్నవి. ఆరంభము మొదలు తుదవరకు ఈగీత

ములు శోకరసముచే బోషింపఁబడి సౌహృద్యములుగా నున్నవి. వైష్ణవ మతమును ప్రబలపరచుటకు చిత్తరంజనుఁడు బంగాళా వాఙ్మయమున నూతనమార్గమును ద్రొక్కెను. 'నారాయణ' యను మాసపత్రికను నెలకొల్పి దానికి కొంతకాలము సంపాదకుఁడై యుండెను. విద్వాంసు లనేకులు ఈపత్రికకు వ్యాసములను వ్రాసిపంపుచుండిరి. వాఙ్మయమున కాతని సేవనుమెచ్చి 1915-వ సంవత్సరమున వంగదేశ సారస్వతసభవారు బంకీపురమునందు జరిగిన సాంవత్సరీక విద్వత్సభకు చిత్తరంజనుని అధ్యక్షునిగాఁ జేసిరి. ఆతని యధ్యక్షకోపన్యాసము గాక ప్రత్యేకముగా వంగీయగీతములను గుఱించి రమ్యమైన వ్యాసరచన గావించి సభలో చదివెను. మరుసటిసంవత్సరము ఢక్కాలో జరిగిన విద్వత్సభకు ఆహ్వాన సంఘాధ్యక్షుఁడై యుండెను. 'నారాయణ' మాసపత్రికలో వంగదేశ పద్యకావ్యములను గూర్చి అనేక వ్యాసములను వ్రాసెను. అవి వైష్ణవ మతగ్రంథములలో నాతనికున్న అపారపాండిత్యమును వెల్లడించెను. వైష్ణవ కవీశ్వరులయొక్కయు భాగవతుల యొక్కయు గొప్ప ఆదర్శములే చిత్తరంజనునకు మార్గదర్శకము లయ్యెను. వాని దేశభక్తి కివియే మూలాధారములు. ఆతనిని చక్కగ నెఱుంగ

గోరువారు ఆతని గ్రంథపఠనమును గావింపవలయును. ఆగ్రంథములను బోధపరచుకొనుటకు వంగదేశ పరిజ్ఞాన ముండితీరవలయును.

కుటుంబము.

మానవుని గుణములయొక్క అభివృద్ధి సామాన్యముగ నాతనికుటుంబముయొక్క పరిస్థితుల నాశ్రయించియుండును. చిత్తరంజనుఁడు సుగుణనిలయమైన తనతల్లిచేఁ బెంపఁబడి తన దేశమును నిజజననియొక్క ప్రత్యగాత్మగా నెంచెను. తనతల్లిని తలఁచుకొనినప్పుడెల్లను చిత్తరంజనుని కన్నులనుండి జలజలనీరుబుకుచుండును. తన తల్లియొక్క దేశభక్తియే చిత్తరంజనున కాదర్శప్రాయమయ్యెను. ఆమె కడు ధీరవనిత; చాలనిదినములలో విధి బలీయమనుచు ఆమె తనయింటిపనులన్నియుదానే చేసికొనుచు భర్తకును బిడ్డలకును అన్నపానముల నమర్చుచు, లేమిడియందు కొన్నిసమయములలో నుపవాసములొనర్చి కాలయాపన జేసెను. ఆమె యోపికకును, ఉదారస్వభావమునకు, ఇంగితజ్ఞానమునకును పరోపకారపారీణత్వమునకును అనేక ఉదాహరణములున్నవి.

తలిదండ్రుల వియోగము.

మన చిత్తరంజనునకు ఆతని తల్లిగుణములు విశే

షముగ పట్టుబడినవి. ఇట్టి తనతల్లియందు దాతని యనురాగము మిక్కిలిగాఢము. కాని, ఆమె గతించు కాలమున నామె చెంతనుండుభాగ్యమును మాత్రము చిత్తరంజనునకుదైవము విధింపలేదు. ఆమె చిత్తరంజనుని సాగరగీతములను తనరొమ్ముమీద నిడికొని తనభర్తతో పునర్భవయైనప్పుడు తానొక ఇల్లాలైనచో చిత్తరంజనునివంటి సుపుత్త్రుఁడు తనగర్భమునందుదయించవలయుననియే తన అంత్యకోరికగా నుడివి ప్రాణములు వీడెను.

తల్లిగతించిన యాఱునెలలకే చిత్తరంజనుని తండ్రియు పరలోకగతుఁడయ్యెను. తలిదండ్రులకు అపరక్రియలను శ్రద్ధతో జేసి యాదినములలో బీదసాదలకు మృష్టాన్నమిడెను. అప్పటియన్నదానమును వంగదేశప్రాంతపు బీదసాదలు ఇప్పటికిని మరువక పొగడుచుందురు. అప్పటినుండి గృహకృత్యములను కుటుంబమునకు పెద్దవాఁడగుటచే వహింపవలసినబాధ్యతను చిత్తరంజనుఁడు ఈసందర్భమున నెన్నియో కష్టములు సంప్రాప్తించినను వానినన్నింటిని సంతోషముతో నెదిరించుచు ధైర్యముతో కుటుంబయాత్రను గడపసాగెను.

సోదరీసోదరులు.

వసంతరంజనుఁడను నాతని తమ్ముఁడు కలకత్తా

హైకోర్టునందు ప్రాముఖ్యతను పొందవలసిన బారిష్టరైనను అకాలమృత్యుప్రాప్తినందెను. చిత్తరంజనున కిప్పుడు జీవించియుండుసోదరులలో పాట్నాహైకోర్టునందలి న్యాయమూర్తులలో నొక్కరుగనుండు శ్రీయుత ప్రఫుల్లరంజనదాసుగారొక్కరే. చిత్తరంజనుని సోదరి అమలాదేవి. కేవలము అపరశారదామూర్తినాఁబరగు. గానమునందు వంగదేశమున ఆమె అద్వితీయురాలు. కలకత్తాలో అనిబిసంటుగారి అధ్యక్షతక్రింద కాంగ్రెసుసభ జరిగినప్పుడు 'వందేమాతరం' గీతమును కాంగ్రెసుసభాప్రారంభమప్పుడు ఆమెపాడి సభవారినందఱను చిత్రపుప్రతిమలవలె 15 నిమిషములు తన కంఠధ్వనియందు నిమగ్నులనుగఁ జేసి ఆనందాబ్ధి నోలలాడించెను. అమలాదేవి మిక్కిలి పరోపకారపారీణత. తనసోదరుని ద్రవ్యసాయముచే గ్రుడ్డివారికిని, కుంటివారికిని, దిక్కులేనివారికిని కలకత్తాలో నొక శరణాలయమును నెలకొల్పి ఇటివలనే ఆమె కీర్తిశేషురాలయ్యెను. చిత్తరంజనునిమఱియొకసోదరి తనభర్త మరణించుటచే బిడ్డలతో గూడ చిత్తరంజనుని పోష్యమున నుండవలసినదయ్యెను. ఇంకొక సోదరి చిన్నతనమునందే మృతిఁజెందెను. నాలవతోఁబుట్టువుసైతము తనభర్తను కోల్పోయి దేశసేవాపర

తంత్రయై, బాలికలకు జాతీయవిద్యను గఱపుటకై నొకపాఠశాలను నిర్మించి దేశసేవచేయుచున్నది.

వివాహము.

1897-వ సంవత్సరమున బిజినీ సంస్థానమునకు దివానుగానుండిన, బాబు వరద హోల్దరనువారి కొమార్తె సుందరాంగి, విదుషీమణియగు వాసంతిదేవిని తనకు సహధర్మచారిణి గావరించి చిత్తరంజనుఁడు వివాహమాడెను. ఈమెగారికి విశ్వవిద్యాలయపు బిరుదు లేకున్నను ఇంటనే విద్యగఱపఁబడుటచే నతి విద్యావ్యాసంగమున కలవాటుపడి గొప్ప విద్వాంసురాలయ్యెను 1919 సం॥ అమృతసరమునందు జరిగిన మహిళా కాంగ్రెసు సభకు ఈమెను అధ్యక్షురాలినిగా కోరిరి. అయితే అదివఱకామె గోషాపద్ధతియందే యుండియుంటినందున బహిరంగసభోపన్యాసమును గావించుటకు కొంత స్త్రీసహజలజ్జనుగాన్పించియుండినను పంజాబు దురంతములవిషయమున పరితాపముగలదై ఎట్టకేల కాపదవినలంకరించుట కొప్పికొని తన యధ్యక్షోపన్యాసమున భారతస్త్రీలందఱును ప్రాచ్యాంగనలగు సీత, సావిత్రులను అనుకరించుటకే యత్నింపవలయు ననియు, కాలానుగుణ్యముగ సందర్భములను కొన్నింటిని మార్పవచ్చునేగాని భారతదేశముయొక్క సార్వ

కాలకాదర్శములగు పాతివ్రత్యము, విధేయత మొదలగు స్త్రీ సహజగుణములను నశింపఁజేయఁబూనుకొనుట కేవల మాత్మహత్య జేసికొనుటకు సమానమనియు, సర్వకాలము నాసభలో గూడియుండినవారెల్లరును భారతనారీమణులే యనియు, ప్రాచీన పవిత్రవంతులైన భారత స్త్రీల సుగుణములే తమవియనియు, వారివలెనే దాము పవిత్రవంతముగ తమకాలమును గడపి ప్రపంచమున ప్రశస్తి గాంచి చనవలయుననియు నుడివెను.

## దానధర్మములు.

చిత్తరంజనుఁడు తనన్యాయవాదవృత్తియందపరిమితధనార్జనను గావించెను కాని, ఆధనమంతయు తండ్రికై తానొనర్చిన ఋణములను దీర్చుటకై కొంతయు, విశేషముగ కష్టపడు బీదసాదలైన నిరుపేదలకొఱకు ధర్మార్థముగ కొంతయును వినియోగపెట్టఁబడెను. తానార్జించిన ధనమును బీదలకు సద్వినియోగపరచుటలో నాతనికుండు సంతోషమునకు మేరలేదు. తనకుండు సర్వస్వమును త్యాగముచేసినగాని భగవంతునిసత్కృపాపాత్రత కెవ్వఁడర్హుఁడగును? అసహాయోద్యమమున నాతఁడు ప్రవేశించి న్యాయవాదవృత్తిని వదలినప్పుడు కుటుంబభరణమునకు మూఁడు లక్షలరూప్యములను మరల ఋణా

ము చేయవలసినంతటి దుస్థితిపాలయ్యెను. ఇందుల
కేమాత్రమును వగఁజెందినవాఁడు కాఁడు. చిత్తరం
జనుఁడు కోరియున్నచో బంగాళముననుండు అనేక
ధనవంతులగు జమీన్‌దార్లవలె తానొక గొప్ప
భూస్వామియై యుండియుండును. అయిన నిట్టిపదవు
లన్నియు 'మీసాలపై తేనియ' లని తలంచి చిత్త
రంజనుఁడు బీదలపాలిటి కల్పతరువై తాను
కష్టించి యార్జించిన యావత్తుధనమును ఆర్తత్రాణ
త్వమున వెచ్చించి తానిప్పు డొరులకు సకలసంప
దల నొసఁగుటకు శక్తియుతుఁడగు నాదిభిక్షువైన
శివునివలెనే భిక్షాటన మొనర్పవలసినవాఁ డయ్యె
ను. త్యాగిగానిదే మోక్షగామి కాఁడుగదా? ఈతని
త్యాగమును గుఱించి వ్రాయబూనినచో గ్రంథము
విస్తరించును. ఈతని గుప్తదానవిషయమున నొక్క
కథ గలదు. ఒకానొకప్పుడు విద్యార్థియొక్కఁడు కల
కత్తానగరమున తన ప్రవేశపరీక్ష రుసుముసైతము
చేత లేక నల్లాడుచు ఇల్లిల్లు తిరిగి వేడుచుండగా నొ
కహితకారి ఆవిద్యార్థిని చిత్తరంజనుని సందర్శించ
మనెను. వెంటనే యావిద్యార్థి చిత్తరంజనుని గృహ
మునకుబోయి వాకిలి ద్వారపాలకుఁడొకనిని చిత్తరం
జనులెప్పుడు మేల్కాంతురు అని యడుగగా దా
వారికుఁ డావిద్యార్థిని కసరిపంపెను. ఈసవిస్తారమును

తనకు హితమొసంగిన వానికి దెలుపగా నాహితకారి మరలనావిద్యార్థిని చాయగా చిత్తరంజనునిఇంటికే పొమ్మని ద్వారపాలకులను సద్దుచేయక ధైర్యముగా లోపలికి పొమ్మనెను. అట్లే వాడొనర్చి చిత్తరంజనుఁడు రాగానే తన గోడునంతయు దీనముగా చెప్పుకొనెను. ఆవిద్యార్థియొక్క సత్యమైన లేమిడిని గుర్తించి వానికి పరీక్షారుసుమునే ఇచ్చినది గాక పరీక్షకాలమగుపర్యంతము కలకత్తాలో నుండునప్పుడు భోజనవసతులకున్నైతము అమర్చెను. ఇంతటి గొప్పవాఁడు ఎవరో అల్పుఁడగు విద్యార్థిని ఆదరించకపోయినను ప్రతిష్ఠకు లోటురాదు. అయినచిత్తరంజనుడు బాహ్యప్రతిష్ఠ పనికిమాలినదనియు, దీనులనాదరించినచో పరమేశ్వరుని ఆదరించునట్లే దృఢమైన నమ్మకము గలవాఁడు గనుక ఇట్టి గుప్తదానములను చిత్తరంజనుఁడు చేసినవి వేనవేలని చెప్పవలసియున్నది.

చిత్తరంజనుఁడు బంగాళీవిద్యాపోషకుఁడు. అందలి వాఙ్మయమునందు ఖిలమైన గ్రంథములనచ్చొత్తించుటకు వలయుధనసాహాయ్యము నొనర్చెను. వంగభాషాసేవకు మితిలేనిద్రవ్యమొసంగెను. అనేక పాఠశాలలకు ధనమునిచ్చి పోషించెను. చెలాచియావైద్యశాస్త్రపాఠశాలాభవననిర్మాణమున కితని

ద్రవ్యము అపారముగ నొసగఁబడెను. బంగాళా సారస్వతాభివృద్ధికిగాను కూడెడు అనేకసభలకు ద్రవ్యమొసంగెను. వంగీయ సాహిత్యపరిషత్సభకు 350 అపూర్వ వంగీయగ్రంథముల నొసంగి కీర్తి గాంచెను. చిత్తరంజనుని ధనసాహాయ్యము పొందని సారస్వతసభ బంగాళాలోనే లేదనవలయును ఇట్టి వదాన్యుఁడును, లోకోత్తరుఁడును త్యాగియునైనవాఁడు వేఱొక డుండుట అరుదు.

సాంఘికదురాచారము.

చిత్తరంజనునకు పాశ్చాత్త్యవిద్యాప్రభావము నాస్తికమతాభిమానము జనింపఁజేసినది అయినను క్రమేణ ఈశ్వరునికృపచే వైష్ణవగ్రంథపరిశోధనలచే గాఢమగు వైష్ణవభక్తి జనించి కేవలము విష్ణుభక్తుఁడయ్యెను. ఈతని కిరువురు కొమార్తెలును, ఒక కొమారుఁడు గల్గిరి. వైష్ణవుఁడైనను సాంఘికాచారములయందు బ్రహ్మసమాజమువారి త్రోవలను ద్రొక్కుటయందే స్థిరచిత్తుఁడై అంతర్జాతీయవివాహాభిమానియై తన పెద్దకొమార్తె నొక కాయస్థ బ్రహ్మాచారికిచ్చి వివాహము జేసెను. ఈవివాహమును జరుపుటకు బ్రాహ్మణ పురోహితుఁడు కూడదని బహుకాలము వాదించి వాదించి భార్య అడ్డుపెట్టగా తుదకు బ్రాహ్మణపురోహితునిగుండానే వివాహమును జరి

పించెను. ఈయంతర్జాతీయవివాహామున కనేక విద్వాంసులు, మహామహోపాధ్యాయ పండిత: హార ప్రసాదశాస్త్రి మున్నగు గొప్పవారు మెచ్చిరి. హిందూసంఘములో అనేక అశాస్త్రీయమైన దురాచారములు వాడుకలో నున్నవానిని రూపుమాపుటయే ప్రస్తుత దేశభక్తుల ప్రథమ కర్తవ్యాంశమని మన చిత్తరంజనుఁడు గాఢముగ నమ్మియుండెను. అట్లే తనకుటుంబములోనుండి దురాచారమును తొలగించుటకు కంకణము గట్టుకొని మొట్టమొదట తనకొమార్తెనే అంతర్జాతీయువరునకు అదివఱకు బంధువే కానివాఁడును సజాతి మతస్థుఁడు నగువాని నొక్కని వెదకి యోగ్యుఁడగు అట్టివానికిచ్చి కృతకృత్యుఁడయ్యెను. తనజాతివారు కొందఱీసాహాసకార్యమునకు తూలనాడిరి. చిత్తరంజనుఁడు చలించలేదు. తన కొమారునిచే సైతము వైద్యకుటుంబ మొకదానియం దుండి కన్యకను దెచ్చి వివాహామాడించెను.

దేశభక్తి.

"దేశసేవ జన్మసాఫల్యమునకు మూలము. నాకు దేశనామము తలంపునకు రాగానే భగవన్నామము సైతము స్మరణకువచ్చును," అని చిత్తరంజనుఁ డొకప్పుడు తనయుపన్యాసమునందు నుడివియుండెను.

దేశసేవ, దేశక్షేమము ఇవిరెండును వారికి హృదయాహ్లాదకరములు. వీనికై తన సర్వస్వమును దారపోసెను. సమయము తటస్థించినప్పుడెల్లను వానికై తనకాలమునంతయు వ్యయపరచుచుండెను. మన చిత్తరంజనుఁడు పల్లెటూళ్లలోని ప్రజల అనారోగ్యస్థితి, విద్యావిహీనత చిత్తరంజనుని చాలా చింతించునట్లొనర్చినవి. మన హిందూజాతి ఉద్ధరింపఁబడవలయునన్నచో పల్లెటూళ్లలోనివారి దుస్థితిని మానునట్లుయత్నించవలయును. విక్రమపురపు ప్రజాభివృద్ధికొఱకొక సంఘమునేర్పఱచి ఆసంఘాభివృద్ధికై విశేషద్రవ్యసహాయముచేసెను. ఇట్లుండఁ 1919-వ సంవత్సరమున తూర్పుబంగాళా రాజ్యమును కాటకము ఆవరించెను. జను లన్నములేక మడియసాగిరి. ఆసమయమున చిత్తరంజనునిచే స్థాపింపఁబడిన పైసంఘము చిత్తరంజనుని సాయముచే కాటకనివారణ బహుకార్యములను చేసినది. ఇందుచే బీదలనేకు లోద్ధార్పఁబడిరి. అంతేగాక పైసంవత్సరారంభమున తూర్పుబంగాళాలో గొప్ప తుపాను వీచెను. పద్మానది విస్తారమగు వెల్లువతో ప్రవహింపసాగినది. వర్షారంభమున కాటకమును వర్షాంతమున ప్రవాహమున్ను దేశము నింతింతనరాని ఈతిబాధలపాలొనర్చి పండిన పైరునకు, పశువులకు ప్రజ

లకు చేసిననష్టమును వర్ణించి తీరదు. ఈప్రవాహ ముచే కొంపలు గోల్పోయినవారును, పైర్లు కొట్టు కొనిపోవుటచే బీదలైనవారును, వస్త్రహీనులును, ఆకలిచే పస్తుపడుండినవార్లును, వీరినందఱ అనుచిత్తరం జనుఁడు స్వయముగా వెళ్లి చూచి వెంటనే ఒకక ష్టనివారకసంఘము నేర్పఱచి దానికై ధార్మికులను సందర్శించి గొప్పనిధిని సేకరించెను. ఆనిధికి తాను పదివేలరూప్యములనుధర్మార్థముగ నొసంగెను. గ్రామములలో కష్టపడు బీదలను గమనించి వారికి సాయ పడుటకు గ్రామసంఘముల నేర్పఱచెను. ప్రతిబీద వానికి కొంత ధనమిచ్చి ఏదైన పరిశ్రమజేసి బ్రతు కునట్లు వీళ్లు కలిగించెను. ఇట్లు అనేక బీదలకుఁ దోడ్పడుచు దేశబంధువను బిరుదమునకు సార్థకుఁడ య్యెను. ఈమహాపుభావునకు దేశభక్తియనగా సంఘభక్తియనియే భావము. ఈసంఘభక్తిచే కష్ట పడుచుండు మానవకోటిపై అపారప్రేమ బొడగ ట్టెను. ఇట్టిప్రేమ తనలో జనించుటచే భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడనియు, భగవంతుని స్వరూపము లైన మానవులెల్లరును పూజార్హులనియు కావుననే మానవసోదరులను కాపాడిన భగవంతుని ఆరా ధించిన ట్లగునని ఈతని పూర్ణమగు నమ్మకము.

బంగాళా రాష్ట్రపు అధ్యక్షకోపన్యాసము.

1917-వ సంవత్సరమున బంగాళా రాష్ట్రపు కాంగ్రెసు శాఖయొక్క వార్షిక సమావేశమునకు చిత్తరంజనుని అధ్యక్షునిగా నెన్నికొన్నప్పుడు తన అధ్యక్షకోపన్యాసమునందు భారతదేశమున సంఘసేవయు, దేశసేవయు రెండును ఒక్కటియే యని స్థిరముగా నిరూపించెను.

దేశస్థితినిగాని దేశపు దీనజనులనుగాని ప్రస్తుతము వంగీయులు గమనించరు. అందుకు కారణము వారు నేర్చుకొను విద్యయు, దాని పద్ధతియు నే యని యీయుపన్యాసమునందు స్పష్టీకరించెను. నూతనవిద్య, నూతనవిద్యాపద్ధతులు, నూతన నాగరీకమున కలవాట్లు, ఇవంతయు జాతీయపద్ధతులను మార్చినదే గాక జాతీయవిధానమునంతయును నశింపఁజేసినదనియు, బంకించంద్రుఁడు నుడివిన సంగతులను పలుమారు తనదేశస్థులు గమనించుచుండవలయుననియు, విద్యావిధానమునంతయు ప్రస్తుతము మార్పొనర్చిన గాని మనజాతికే నిలువనీడయుండక తప్పకజాతిసైతము క్షీణించుననియు నుడివెను. ప్రస్తుత నూతన విద్యాపద్ధతియంతయు విద్యాధికులమనుకొను మనకును మనవారగు పామరజనులకును మధ్య పెద్ద అఖాతము నేర్పఱచెను. ఈయాఖాతము

నకు మనము సేతువు నిర్మింపవలయును. అట్లు సేతువు నిర్మించినగాని మనజాతీయపరిస్థితులు పునరుద్ధరింపఁబడవు; అని నుడువుచు ఆంగ్లేయులు భారతదేశమున కేర్పాటుగావించిన నూతనవిద్యాపద్ధతులలోని లోపముల నన్నింటిని వెలిబుచ్చెను. కావున బాలురకు విద్యావిధానమునంతయు దేశభాషలో నే గావింపవలయుననియు పరభాషయగు ఇంగ్లీషునందే నేర్పరాదని సిద్ధాంతముచేసెను. ఇంగ్లీషుభాషచే నేర్పడుదాసగు లింతింతనరాదనియు, పల్లెటూరిజనులకును మనకును ఈభాష సామీప్యమును చెందించదనియు, నట్లు చేయుటచే జాతీయభావములకు మనము వెలియై పోవుచున్నామనియు నుడివెను. మన జాతీయత యనగా నేదియో యది ఇప్పటికిని మన జీవనార్థము కష్టపడు వ్యవసాయదారుని గృహమునందు తాండవమాడుచున్నది. ఆవృత్తివానిని మనము నిరసించెదము. వానిని మన ఆంగ్లేయవిద్యగాని ఆంగ్లుల నాగరికముగాని ఆంగ్లన్యాయస్థానములుగాని చెరుపనేరదు. మనజమీందార్లుగాని ధనవంతులుగాని ప్రస్తుతపు మన ప్రభుత్వమువారుగాని క్షీణింపజేయు లేని వ్యవసాయవృత్తిదారునికంటె ఆంగ్లేయవిద్యనుచదివినామనివిఱ్ఱవీగుఅల్పసంఖ్యాకులలోఁ జేరిన మనమా అధికులము? ఇట్టి బూటకపు అహం

కారమునుండియు, జాత్యాధిక్యమను డాంబికచర్య నుండియు మనము తొలఁగుటకు యత్నింపవలయును. పరమేశ్వరుని దివ్యమంగళవిగ్రహము మన బీద జనులలో తాండవమాడుచున్నదని గ్రహింపుఁడు. వారిని అనాగరకులని భావింపకుఁడు. వారు ఆపదలో నుండువానికి సాయమొనర్చెదరు. క్షుత్పిపాసాపీడితునకు అన్నోదకముల నొసగెదరు. వారు ఆపదలను గుర్తింతురు. ఆతిథ్యమొసంగుదురు. స్వార్థత్యాగమును వలసినప్పుడు చేయుదురు. వారాయనాగరకులు? వారినేలమనము నిరసించవలయును? దీనస్థితియందుండువారని వారిని మీరెన్నుదురు. కోటానకోట్లుగ ఇట్టి స్వరూపములు భారతదేశములో నున్నవి. వారు హిందువులైనను సరే మహమ్మదీయులైనను సరే చండాలురైనను సరే క్రైస్తవులైనను సరే పార్శీజాతులైనను సరే అందఱను నారాయణస్వరూపములనియు వంగీయులంద ఱెన్న వలయును. వారితో మీసోదరులతో కలసిమెలసి యుండునట్లుండుఁడు. అప్పటికిగాని మీదేశోద్ధారకపు కృషి ఫలించినదని తలపకుఁడు.

పల్లెటూరియందే మన జాతీయ నాగరకము కేంద్రీభూతమైయున్నదని తలంపుఁడు. దానిని అనాదరణచేసినచో మనయావద్వ్యవహారములును తప్పక

క్షీణించినవని తలచుకొనుడు. పల్లెటూళ్లు ప్రజాక్షీ
ణతను చెందినందులకు కారణములు రెండు. ప్రథమ
మున పల్లెటూళ్లలో ఆరోగ్యముచెడి జ్వరబాధ
ఎక్కువయ్యెను. రెండవది నగరవాసవాంఛలో
భోగాపేక్ష, వ్యాపారవాంఛతో ద్రవ్యమును సేక
రించుటకు జను లత్యాతురపడెదరు. కావున ప్రస్తు
తపు మహాపట్టణములు ఘోర అజగరములవలె
చిన్నచిన్న ప్రాకుడుజంతువులగు పల్లెటూళ్లను నశింపఁ
జేయుచున్నవి. కావున మన కర్తవ్యధర్మములలో
పల్లెటూళ్లయొక్క ఆరోగ్యమును, అభివృద్ధిని,
క్షేమమును కాపాడుటకు యత్నించుటయే ప్రథమ
గణ్యము. పల్లెటూరివానికి వలయు నీటిపారుదల,
ఆరోగ్యపద్ధతి, విద్య వీని నన్నింటిని యేర్పాటు
చేయుటకు మనము యత్నింపవలయును. వ్యవసాయ
దారుఁడు పూర్వము ఆఱునెలలు పొలములో పని
చేసి పనిలేనికాలమున రాట్నమువద్ద కూర్చుండి
వలయు నూలు వడికి నేతగానికి తానుధరించువస్త్ర
ములకు గావలయు నూలు నందిచ్చుచుండును. కట్టు
బట్ట తినుటకుతిండి సునాయాసముగా కర్షకుఁడు సం
పాదించుకొనును. అట్టివ్యవసాయదారుఁడు ఈదినము
లలోమృగ్యమయ్యెను. వానితో గుప్తజీవనము సైత
ముపల్లెటూరును వదలిపోయినది. ధాన్యపుపాతరలు

గాని, కోట్లుగాని, పల్లెటూళ్లలో పూర్వము పండ్ల కొలది బంగారువాసననీనుచుండునది కన్నులకు కలికమయ్యెను. పంటలుతరిగెను; పాడియసలే లేదు. పచ్చని బయళ్లతో విరాజిల్లుచుండిన భూభాగములు ఎడారి వలెగాన్పించుచున్నవి. గ్రామదేవతలారాధింపఁబడవు. ఇలువేల్పులను తలచువారే లేరు. దుక్కిటెద్దుల నమ్మి శిస్తుకట్టవలసినకాలము తటస్థించినది. బీదరైతునకు ఊరికాధారమైన చెఱువునందు నీళ్లులేవు. గుంటలు, బావులు నిర్జలములైనవి. వాడెట్లు జీవింపగలఁడు? వానికి ఆధారములను జేయుటకు ఊరియందు మనుష్యులు లేరు. ఉన్నవాఁడశక్తుఁడు. ఇంకపల్లెటూళ్లునశింపక వృద్ధియగుటెట్లు? ఊరుక్షీణించగనే జాతీయవిధులకు ఆకరములన్నియు నశించుచున్నవి. వ్యవసాయము క్షీణించెను; పరిశ్రమలన్నియు నశించినవి. రాట్నము, నేతమగ్గము, కమ్మరి యావము మొదలగు చేతిపనులకు సాధనములన్నియు నశించినవి. పల్లెటూరివాఁడు తనకు కట్టుబట్టకు మాంచెస్టరు యంత్రముల నాశ్రయించుచున్నాఁడు, లాంకాషైరు వర్తకులదయకు పాత్రీభూతుఁడయ్యెను. వంట పాత్రములకు చీనావానిదయకును, ఆస్ట్రియావాని దయకును పాల్పడెను. ప్రమిదలా దీపముంచుకొనుటకు మాయములైనవి, గ్లాసులుబయలు దేరినవి, పల్లె

విషయమును, వ్యవసాయదార్లకు రాత్రిబళ్లను, గ్రామ పరిశ్రమలను, వ్యవసాయవిద్యను, కుటుంబఆర్థికాభి వృద్ధియంతయు ఈపంచాయతీదార్లచే నుండగల దనియు, కొన్ని పెద్దగ్రామములలో ప్రత్యేక పంచాయ తీల నేర్పఱుపవచ్చుననియు, చిన్నచిన్నగ్రామములను కొన్నింటిని జేర్చి యాగ్రామములయొక్క పంచాయ తీల నేర్పఱుపవచ్చుననియు, ప్రతిగ్రామమునందును కాటకసమయమున గ్రామములోని బీదవాండ్ర సం రక్షణార్థము ధాన్యపుసేకరము గావింపఁబడవలయు ననియు, ఈధర్మకూట్లకు యేటా ఫలితకాలమున గ్రామస్థులందఱు యథోచితముగ శక్తి ననుసరించి ధాన్యమును ధర్మముగా నొసగుచుండవలయు ననియు, ఈధాన్యపు కూట్లు గ్రామపంచాయతీ దార్లపాలనచే రక్షింపఁబడవలయుననియు, కాట కముసంభవించినపుడు పంచాయతీదార్లు ధర్మధా న్యకూట్లనుండి ఆగ్రామపు బీదజనులను అల్లాడ నీయక పోషింపవచ్చుననియు నిట్టి పద్ధతులతో గూ డిన పంచాయతీపరిపాలన యేర్పాట్లనుకొన్నింటిని మిక్కిలి నేర్పుతో నాసభలో తనయుపన్యాసము నందు సూచించెను. గ్రామములోని స్వల్పతగవులను ఈపంచాయతీసభ వారు తీర్చినమేరకు జనులు నడుచు కొనుచుండవలయుననియు, పెద్దతగవులను జిల్లా

సభలలో ఫిర్యాదుచేయవలయుననియు, ఆజిల్లా సభ్యుల తీర్మానము ననుసరించియే ఉభయకక్షిదార్లును నడుచుకొనవలయును. పెద్దగ్రామములలో పంచాయతీలను గ్రామములోనుండు పెద్దలును నిష్పక్షపాతబుద్ధిగలవారు పదుగు రున్నప్పుడు వారిలోనుండి 5 గురిని అధికసంఖ్యాకసమ్మతులను బడసినవారినేరి ఏర్పఱచుకొనవలయును. చిన్నచిన్నపల్లెలు జనసంఖ్యప్రకారము పదిపల్లెలో అయిదుపల్లెలో ఒక నియమితజనసంఖ్య గలవిగా జేసికొని ఆపల్లెలలోని పెద్దలను నిష్పాక్షికబుద్ధిగల వారిని 5 గురిని పై పెద్దగ్రామములలోవలెనే యేర్పఱచుకొనవలయును. ఇట్లే ఈగ్రామపంచాయతులనుండి జిల్లాసభ్యులను జేర్చవలయును. ఈజిల్లాసభ్యులు సుమారు 200 మొదలు 500 వఱకు ఉండవలయును. ఈజిల్లాసభ్యులు 1. గ్రామపంచాతీలుసరిగా పనిచేయుచున్నారా యని వారికి పై యధికారులుగ ప్రవర్తించవలయును. 2. పంచాయతీలకార్యవిధానములను ఈజిల్లాసభ్యులు సూచించుచుందురు. ఈజిల్లాసభ్యులు జిల్లాముఖ్యపట్టణము యొక్క ఆరోగ్యపరిస్థితికి, ఆపట్టణపు బాలురవిద్యకొనసాగుటకును పూచీదార్లుగనుందురు. 3. ఆజిల్లాసభ వ్యవసాయాభివృద్ధికరములగు సూచనలను

చేయును; గ్రామపరిశ్రమాభివృద్ధికి పూఁచీగానుం డును. 4. గ్రామముయొక్క ఆరోగ్యపరిస్థితులకు గ్రామపంచాయతీదార్లపై అధికారమును వినియోగించును. జిల్లాసభలో ఆరోగ్య శాఖకుజబాబుదారిగ ప్రవర్తించును. 5. జిల్లాలో నుత్పత్తికాఁగలవస్తువుల కాధారభూతములగు పరిశ్రామికాభివృద్ధికి ఈ జిల్లాసభలు తోడ్పడగలవు. 6. ఈజిల్లాసభలు చౌకీదార్లను, గ్రామోద్యోగుల నేర్పరచు అధికారము గలిగియుండును. 7. జిల్లాపోలీసుపై సర్వాధికారము ఈజిల్లాసభకుండును. 8. ప్రతిజిల్లాసభయును తమ సభ్యులలోనుండి అధ్యక్షుని ఒక్కరుని ఎన్నుకొనుట కధికారముగలిగియుండును. అనేక విషయములను చర్చించుటకు ప్రత్యేకసభలను గూర్చుట కధికారముగలిగియుండును. 9 ప్రతిజిల్లాకును ప్రత్యేక (బ్యాంకి) ధనాగారముండగలదు. ఈబ్యాంకీలకు ప్రత్యేకశాఖాబ్యాంకీలు గ్రామములలోనుండును. 10. ఈబ్యాంకీలకు వలయుధనమును ఆజిల్లాలో పన్నులను వేసి వసూలు పఱచుటకు ఆజిల్లాసభ కధికారముండును 11. ప్రస్తుతపు లోకల్ బోర్డులు జిల్లాబోర్డులు రూపుమాసిపోవలయును. 12. గ్రామసభలను, జిల్లాసభలను నడపుటకు ప్రత్యేక చట్టములను నిర్మింపవలయును. హిందూ

సంఘమునకు వలసిన ముఖ్యమైన యేర్పాట్లయొక్క సూక్ష్మప్రణాళిక ఇట్టి నిబంధనలపై ఆధారపడవల యును. దీనికే స్వరాజ్యము, లేక గ్రామస్వపరిపాల నమని పేరు. ఇట్టిపద్ధతి మన దేశములో ప్రాచీనకాల మునందుండి సాగుచుండెను. ఇవి మనజాతీయతాభి వృద్ధితో పెరిగెను. వీనికని మనజాతీయతకును ప్రత్యేకమైన ఒద్దికగలదు. చిత్తరంజనుఁడు ప్రాచీన పద్ధతులకే మనలను మరల్చెను. కాని, ఇందు నూతన నము లేమియు లేవు. ఇట్లు సాంఘికాభివృద్ధికి, దేశా భ్యుదయమునకీ దేశభక్తుఁడు ఈపరోపకారి పాటు పడెను.

రాజకీయములు.

చిత్తరంజనుని దేశభక్తి కొంతవఱకు దెలిపితిమి. అతఁడు ప్రస్తుత రాజకీయవాతావరణమున ప్రవే శించుట మొదటి సందర్భము. అనిబిసెంటును మద రాసురాజధాని దొరతనమువారు నిర్బంధావాసము న నుంచుటతో ప్రారంభమైనది. 1917సం॥ జూలై 17-వ తేదినాడు కలకత్తాపురజనులు అనిబిసంటు ను నిర్బంధించినందులకుగాను ఒక అసమ్మత సభాస మావేశమునుగావించిరి. ఆసభలో చిత్తరంజనుఁడు రాజకీయోపన్యాసమును గావించి తనకుండు ప్రస్తు తదొరతనపు విధానములోని అసమ్మతిని బయలుప

ఱచెను. ఇట్లే ఆదినములలో పలువురు నిర్బంధింపఁ బడిరి. వారివిడుదలకుగాను చేసినసభలలో చిత్తరంజనుఁడు సభ్యులను తనయుపన్యాసమునందు మగ్నులనుగావించెను. చిత్తరంజనుఁడు ఏసభయందు ఉపన్యాసముచేయునాయని ప్రజలు ఆతురపడుచుండిరి. ఊఱక ఉపన్యాసమేగాక చెఱసాలల కంపఁబడిన వారి కుటుంబములు అన్నములేక మలమల మాడుచుండ వారి కుటుంబములను తాను పోషించు నిమిత్తము కంకణము కట్టుకొని ఈవిషయములో నెలకు 4 లేక 5 వేల రూపాయలను వెచ్చింపసాగెను. ఇంతటికరుణాసముద్రుఁడు ప్రపంచముననే యుండుట అరుదని తనప్రవర్తనవలన లోకులకు విశదీకరించెను. దేశాభిమానమును చూపువారు కొందఱు సభావేదికలపై నిలిచి తమవాగ్ధోరణినిగన్పింతురు. కొందఱు కన్నీరు మున్నీరుగ కార్తురు. ద్రవ్యమును వెచ్చింపవలసివచ్చినప్పుడు మాత్రము వెనుదీయుదురు. మనచిత్తరంజనుని దేశాభిమానము అట్టిదికానేరదు. రాజకీయనేరములకై చెఱసాలయందుంపఁబడినవంగీయు లనేకులు 1919సం॥ డిసంబరు నెలలో విడుదలచేయఁబడిరి. వీరందఱును చిత్తరంజనుని ఇంట్లో ఒకసందర్భమున సమావేశమై తమకుటుంబముపట్ల చిత్తరంజనుఁడు చూపిన అపారమగుసాయ

మునకై చలించి చిత్తరంజనునకు జూపిన తమవిధే యత వేనోళ్లపొగడఁదగినది. 1917-వ సంవత్సరమున కలకత్తాలోజరిగిన దేశీయమహాసభకు చిత్తరంజను డుచేసినయుపకృతి అపారమైనది. బంగాళమునందు 1916-వ సంవత్సరమున స్వరాజ్యకలహములో చిత్త రంజనదాసు, శ్రీ చక్రవర్తి, విపినచంద్రపాలు—వీరు అగ్రగణ్యులు. 1917-వ సం. ఆనిబిసెంటమ్మను నిర్బం ధమునుండివిడుదలచేయుటకుగాను కలకత్తాలోరాజ కీయవిషయైకమగు సందర్భములలో తాను వ్యవహ రించుటకు ప్రారంభించినది మొదలు చిత్తరంజనుఁడు ఈనాఁడువఱకు వెనుకడుగిడక తదేకదీక్షతో ఇండి యాప్రభుత్వముయొక్క నిరంకుశాధికారవర్గముతో నిర్భయముగా ఱొమ్మునుజూపి పోరుచునే యున్నాఁ డు. 1909-వ సంవత్సరమునుండి నిరంకుశాధికారవర్గ ముయొక్క అధికారులబారిబడి యనేకులు నేరస్థులై విచారణలకు వచ్చినప్పుడు వారికి సాయపడి వారిత రఫున తాను వాదించి వారిని విడుదలజేయించి మహోపకారమొనరింపసాగెను. కలకత్తాలోట్రంకు కూనీకేసని యొకదానిలో పోలీసులచేత నిద్దఱు నిరపరాధులు దోషులైరి. నిష్కారణముగ నిందితు లైన వీరివిషయమై చిత్తరంజనుఁడు జాలిగొని వారి తరఫున తాను వాదించి న్యాయాధిపతులకు వారు

నిర్దోషులని తలంపుగొనునట్లుచేసి వారిని విడుదల గావించెను. ఇట్టివి లెక్కించినచో వానికి అంతము లేదు. 1918-వ సం॥ ఇండియామంత్రి మాంటాగూ గారు సంస్కరణలవిషయమై దేశములోని సంఘ ముల యాలోచనలను గైకొనుటకు ఇండియాకు రాగా దేశీయమహాసభతరఫున చిత్తరంజనుఁడును మఱికొందఱుగూడి యొకగొప్ప మెమోరాండము ను సిద్ధపఱచి భారతమంత్రియెదుట నుంచిరి. అంతే గాక 1918-వ సంవత్సరమున మహామంత్రిగారితో దేశక్షేమముల విషయమై ముచ్చటించవలసిన సంగ తులను ఆలోచించుట కొఱకు ఆగష్టునెలలో దేశీ యమహాసభకు సంబంధించిన భారతదేశీయప్రము ఖులు బొంబయిలో సభఁజేసిరి. ఆసభకు జనాబ్: హోసాన్ ఇమాంగారు అధ్యక్షులు. ఆసభకు చిత్త రంజనుఁడు వంగదేశమునుండి నూర్గురు ప్రతినిధుల ను తన స్వంతఖర్చు పెట్టి పిలుచుకొనిపోయెను. సభ ముగియగానే లోకమాన్య తిలకుగారు చిత్తరంజ నులను, చక్రవర్తి మున్నగు వంగీయప్రతినిధులను మఱి ఇతరరాష్ట్రపుప్రతినిధులగు కొందఱను పునహా కు విచ్చేయుమని కోరగా వల్లెయని పునహాకువెళ్ళిరి. అప్పట్లో చిత్తరంజనునియొక్క సహజౌదార్యము, కార్యదీక్ష, ఆలోచనాశక్తి, దేశసేవాపరాయణత్వ

మునకు లోకమాన్యులద్భుతపడిరి. ఇరువురకును మైత్రికుదిరెను. పునహోకు నీమహానీయులు విచ్చేయగా లోకమాన్యులొక సభఁజేసి వీరి నభినందించి దేశాభ్యుదయమునకు గాను ఈమహామనులు బూనియుండు తదేకదీక్షను గొనియాడుట కొక సభగావించెను. ఆసభకు బాబుమోతీలాల్ ఘోసు (అమృతబజార్ పత్రికాధిపతి) గా రగ్రాసనాధిపత్యమును వహించిరి. ఈ సభాసమావేశానంతరము చిత్తరంజనునికి లోకమాన్యుల యెడ అపరిమితమగు భక్తిజనించి ఆభక్తి లోకమాన్యుల మరణపర్యంతమును ఇప్పటికిని తరుగనిదై ప్రకాశించుచున్నది. 1918-వ సంవత్సరము దేశీయమహాసభ ఢిల్లీలోగూడెను. ఈసభకు మదనమోహనమాళవ్యాగా రగ్రాసనాధిపతులు. వారితోగూడ చిత్తరంజనులును దేశీయమహాసభకువిచ్చేసిరి ఈసభయొక్క విషయనిర్ధారక సంఘసమావేశమునందు ఆనిబెసాంటమ్మ అయిదవజార్జిచక్రవర్తికొమారుఁడు మనయువరాజు భారతదేశ సందర్శనార్థమై రాఁబోవుచున్నాఁడు; ఆసమయమున దేశీయమహా జనుల తరపున వారికి సన్మానపత్రమొకటి అర్పింపవలయునని యొకతీర్మానమును తెచ్చుటకు యత్నింపగా చిత్తరంజనుఁడు దాని కాటంకముగా ఉపన్యసించి

ఆతీర్మానము సభలో చర్చకేరాకుండునట్లు యుక్తి యుక్తముగ మాటలాడెను.

1918_వ సంవత్సరమున కలకత్తాలో రాజకీయ కలవర మొకటి ప్రారంభముకాగా నందు చిత్తరంజనుడు ప్రవేశించి గొప్పన్యాయాధిపతివలె వర్తించి కలవరమును అంతమొందించి శాంతిని నెలకొల్పెను. ఇప్పుడే పాంచాల దేశమున సర్ మైకల్ ఓడ్వాయరు యొక్క దుష్పరిపాలనక్రింద పాంచాల దేశమున ఘోరమరణములు, ఘోరహత్యలు, కొన్ని ప్రదేశములలో సైనికపరిపాలనము, ఆపరిపాలనమునం దధికారులు గావించిన ప్రజాపీడనము ఇవన్నియు భారతదేశము నందు ప్రజాహృదయమును కల్లోలపరుపసాగెను. అప్పట్లో చిత్తరంజనులు పాంచాలమునకు స్వయముగా వెళ్ళి నిజపరిస్థితుల నరసివచ్చుటకు బయలుదేరగా దొరతనమువారు వీరిని పాంచాలమున కడుగు బెట్టగూడదని హెచ్చరిక జేసిరి. ఈపాంచాలదురంతముల నాధారముగఁ జేసికొని మహాత్మగాంధిగారు సత్యాగ్రహవిధానమును భారతదేశమున ప్రారంభించెను. ఇది దేశమంతయు నల్లుకొని దేశములో నుండు జాతీయనాయకులందఱును ఈవిధానమును అవలంబించుటకు యత్నింపసాగిరి. చిత్తరంజనుఁడు నైతము ఆయుద్యమము పవిత్రవంతమనియు నిరం

కుశాధికారవర్గముయొక్క చర్యకు నిరాయుధులగు భారతీయులకు తప్పక శరణ్యమని దీర్ఘాలోచనము చేసి తీర్మానించి, తానును ఉద్యమమునకు లొంగెను. పంజాబు దురంతములను విచారించుటకు దొరతన మువారొక కమిటీని ఏర్పఱచిరి. ఆకమిటీ నివేదికలో యథార్థము వెల్లడికాదని గుర్తించి కాంగ్రెసుసభ తరఫున మహాత్మాగాంధి, చిత్తరంజనులు, జయకర్, తయ్యాబ్జీ మున్నగు సభ్యులతోఁగూడిన నొకకాంగ్రెసుఉపసంఘము అమృతసరములోఁ గూడి విచారణకు ప్రారంభించెను. నెలకు ఎన్నియోవేల రూపాయలను ఆర్జించుచుండిన చిత్తరంజను తీవ్రజోపయోగ కార్యమగు పైకమిటీ సభ్యత్వమున కియ్యకొని రెండునెలలు తన న్యాయవాదవృత్తిని వదలి అమృతసరములోనుండెను.

1919-వ సంవత్సరమున అమృతసరమున డిసంబరు నెలలో దేశీయమహాసభ కూడెను. ఇందు చిత్తరంజనులు సభకు నాయకమణియై ప్రకాశించెను. ఈసభాసమావేశమునందు మహాత్మా గాంధిగారును, చిత్తరంజనులును కొన్నితీర్మానములలో భిన్నాభిప్రాయులైరి. ఇండియామంత్రి మాంటాగూగారికి దేశీయమహాసభ తరఫున వందనము లర్పింపవలయునను తీర్మానమునందు దేశీయనాయకులలో తీవ్ర

మగు భిన్నభావములు జనించినవి. అయినను సభలో కలవరముకలుగక శాంతముగా, జయప్రదముగా ఆ యేటి కాంగ్రెసుసభ ముగిసినది. తాను తన మనస్సున నేది సరియని తీర్మానమునకు వచ్చునో దానిని అనాలోచితముగ తీర్మానించు స్థిరబుద్ధిగలవాఁడు చిత్తరంజనుఁడు. ఎదుటివాఁడు ఎట్టివాఁడైనను తన నిర్ధారించిన యోచనను పూనికతో నెరవేర్చువరకొక కాలిపై నిలుచునంతటి ధీరచిత్తుఁడు చిత్తరంజనుఁడు. కలకత్తాలో జరిగిన ఖిలాఫత్ విషయిక మహాసభలో గాంధిగారియుద్యమమునకు చిత్తరంజనులు వ్యతిరేకముగ పాటుపడిరి. ఈయుద్యమమున హిందువులు ప్రవేశించుట సరికాదని అప్పట్లో చిత్తరంజనుని తలంపు. అయితే ఈతలంపును మార్చి 1920-వ సంవత్సరమున జరిగిన ఖిలాఫత్తు విషయమైన మహమ్మదీయులసభకు చిత్తరంజనులు తోడ్పడి వారియుద్యమమున పట్టుదలతో పనిచేయుటకు ప్రారంభించెను. దేశీయమహాసభలో గాంధిమహాత్ముని తీర్మానము అసహాయోద్యమముపట్ల జయమొందెను. దాని ననుసరించి నెలకు 30, లేక 40 వేల రూపాయలను గడించుచుండిన చిత్తరంజనుడు తనన్యాయవాదవృత్తిని వదలవలసివచ్చెను. ఇంతత్యాగమున కొడిగట్టినవాఁడే గదా ఈమహానీయుఁడు. చిన్ననాట

నుండి ద్రవ్యమునకై కష్టించి క్రమేణ తనవృత్తి వలన ఆర్జించినధనమును బీదలకనియే వినియోగింప సాగి పిదప దేశసేవయే పరమధర్మమని దేశసేవా పరాయణుఁడైన చిత్తరంజనునివంటి త్యాగి ప్రపంచమున నుండుట అరుదు. ఇదివఱకు సీమగుడ్డలను ధరించుచుండిన చిత్తరంజనుఁడు ఖద్దరుగుడ్డలను ధరింపసాగెను. దేశమునకై భోగములను విడనాడెను. న్యాయవాదవృత్తిని వదలెను. ప్రజాసేవ కర్తవ్యమని పూనెను. ఇంతటిమహానుభావుని ప్రాచీన భారతఋషి సాంప్రదాయపరుని, మహాత్యాగిని అహమదాబాదు దేశీయమహాసభకు భారతదేశపు సకలరాష్ట్రములవారును ఒక్కుమ్మడిగా అగ్రాసనాధిపతిగ నెన్నుకొనిరి. ఈసమయమున భారతదేశములో గాంధిమహాత్ముని యుద్యమము తీవ్రముగ పనిచేయుటకు ప్రారంభించినది. ఈయుద్యమమును మొదలంట నఱికివేయవలయునని నిరంకుశాధికారవర్గము వారు దీనికి ప్రతిచేయుటకు నిశ్చయించిరి. ఈప్రతినకు ఫలితముగా దేశములోని ఉద్యమనాయకులను వేనకువేలుగా నిర్బంధముచేసి కారాగృహములకు అధికారవర్గము పంపెను. దేశమంతయు ఘోరశాసనపీడితమయ్యెను. సేతుశీతాచలమధ్యోర్వి దేశనాయకుల నేరి యేరి జెయిళ్లకు పంపెను. అప్పుడే

లజపతిరాయని లాహోరులో నిర్బంధించిరి. ఈమహా మహాుని నెఱుంగని భారతీయుఁడు లేఁడు. ఈపరోపకారి కాంగ్రెసునకు ఆత్మవంటివాఁడు. ఐరోపాసంగ్రామకాలమందు భారతప్రభుత్వమువారు వీరిని అమెరికానుండి భారతదేశమునకు రానీయక అడ్డుపెట్టిరి. తత్పూర్వము భారతదేశమున ప్రథమమున నీదేశోపకారిని విచారణలేకయే ప్రవాసమునకు పంపిరి. ఐరోపాయుద్ధానంతర మీతఁడు భారతదేశమున కేతెంచెను. అప్పటినుండి ఈయన కాంగ్రెసుపట్ల పూర్వమువలెనే నిరంతరకృషి యొనర్చుచునే యున్నాఁడు. లజపతిరాయిని కలకత్తా అవసరకాంగ్రెసునకు అధ్యక్షునిగ ప్రజలొనర్చిరి. ఈసభలోనే అసహాయోద్యమము నాచరణలో నుంచఁబడవలయునని మహాత్మాగాంధి తీర్మానమును సభవారియామోదమునకు దెచ్చెను. లజపతిరాయి అధ్యక్షతక్రింద జరుపఁబడిన ఈఅవసర కాంగ్రెసుసభలో నధికసంఖ్యాకు లీతీర్మానము నంగీకరించిరి. ఇట్టి లజపతిరాయివంటిమహానుభావుని దొరతనము నిర్బంధింపగానే చిత్తరంజనుఁ డతిరోషయుతుఁడయ్యెను. నిరంకుశాధికార వర్గముయొక్క చర్యలను మితిలేక ఖండించెను. కాంగ్రెసులో తీర్మానమైనమేరకు కలకత్తావిద్యార్థులను తమబళ్ళను వీడమని మహోప

న్యాసముల నొసంగెను. విద్యార్థులు విధేయులైరి. చిత్తరంజనుఁడు తనమహోపన్యాసములలో నొక్క దానియం దిట్లు చెప్పియున్నాఁడు.

విద్యార్థులు, ఐచ్ఛికభటులు.

"లజపతిరాయిని అధికారులు బంధించి కాంగ్రెసును బంధించిరి. లజపతిరాయిగారు కాంగ్రెసుకు పట్టుకొమ్మ. దీనివలన దేశీయమహాసభయే దెబ్బ తినినది. అధికారవర్గముయొక్క ఈబాహాటమైన చర్యవలన బలాబలములను చక్కఁగ జూపుటకు అవకాశమేర్పడినది. కాంగ్రెసువా రేర్పఱచిన (స్వరాజ్యప్రాప్తికి) నియమితకాలము సమీపించినందున ఫలితము ప్రకటింపఁబడుటకు సమయమైనది. బంగాళా దేశములోని నిర్బంధములు ఇతరరాష్ట్రపు నిర్బంధములకు తీసిపోవు హిందూమహమ్మదీయ సఖ్యత ఐకమత్యము ప్రపంచమునకు చాటుచిహ్నమో యన పీర్‌బాద్షామియాఁగారిని, డాక్టర్ సురేష్ గారిని కలిపి సంకెలలు తగిలించి జెయిళ్ళకు గొంపోయిరి. ఇట్లే చిటగాంగున జితేంద్రమోహానసేన్ గుప్తగారు, ఉపాధ్యాయ నృపేంద్రుఁడు వెయ్యిమంది ఐచ్ఛికభటులతో మహామహోపధ్యాయ జిరేంద్రనాథముఖర్జీగారు, వీరందఱు జెయిళ్ళకంపఁబడిరి. కోమిల్లాజిల్లా బ్రహ్మంచేరియాలో అధికార

వర్గము కోరువారికన్న ఎక్కువమంది జెయిళ్ళకుపోవు టకు సంసిద్ధులై యున్నారు. కలకత్తాసంగతి యేమి యని నాకు చింతగానున్నది. కలకత్తాలో నిన్నికళా శాలలున్నవి. ఇన్నిపాఠశాలలుండు ఈపట్టణమున 5 వేలమంది వాలంటీర్లు మాత్రమేనా? వీరిలో నార్గురు మాత్రమే బంధింపఁబడిరి వీరు వడుకు నూలుబట్టల నమ్ముచు రాటములను గృహములకు పంచిపెట్టు నేరము మోపఁబడిరి. ఈకారణముననే వీరి కీనిర్బంధము. అందువలన దొరతనమువారు అసహాయోద్యమము నణచివైచుటకు కంకణము కట్టికొనిరని తేలినది. ఇంతగొప్ప కలకత్తాపట్టణ ములో 5 వేలమందేనా ఐచ్ఛికభటులు? దేశీయ మహాసభోద్యమము అపుడల కానున్నదట! ఓకలక త్తావిద్యార్థులారా! మీరేమిచేసెదరు? ఇప్పుడేనా చదువుకు సమయము? కళలు, సాహిత్యము, గణి తము, శాస్త్రము వీనిని సాధించుట కిదేనాసమ యము? దేశమాతపిలుపునకు మీహృదయములు కరుగవా? ఈగొప్పపట్టణము నాకు నిర్జనమైన ఎడా రిగానున్నది. నాచుట్టు సదా యువకులున్నారు గాని వారికి ముఖవికాసములు లేవు. నిరుత్సాహులు, జీవ చ్ఛవములుగ గాన్పించుచున్నారు. వారికి ఆత్మబల మునొసంగుటకును వారిని ఉత్సాహాయుతులను

గావించుటకును నాకు శక్తిని ప్రసాదించుటకు దేవుని ప్రార్థించెదను. దేశాంతరములలో స్వేచ్ఛకు పోరాడినవారు యువకులేగాని వృద్ధులుగారు. నిర్మలహృదయులై, స్వార్థత్యాగపరాయణులైన యువకులే ఈకార్యమునకు పోరాడవలసినవారు. యుద్ధమాసన్నమైనది. నేనా ముసలివాఁడ నగుచున్నాను. మనోదార్ఢ్యము తప్పుచున్నది. నన్ను ఇంకను నిర్బంధించలేదు. అయితే నాచేతులకు సంకెళ్ళుతగిలించి నన్ను నిర్బంధించినట్లు నాకు గోచరించుచున్నది. ఈవేదన దాస్యసంబంధమైనది. భారతమంతయు చెఱసాలయైయుండ నన్ను నిర్బంధించియుంచిన నేమి, విడుదలగ నుంచిన నేమి? నేను బ్రతికియున్నను చచ్చినను దేశీయమహాసభోద్యమము అవిచ్ఛిన్నముగ జరుగవలయును."

నిర్బంధము.

చిత్తరంజనుని ఈయుపన్యాసముచే కలకత్తాలోని కళాశాలల విద్యార్థులేమి హైస్కూళ్ల విద్యార్థులేమి వేనకువేలు నేల యీనినదన్నట్లు ఐచ్ఛికభటులుగఁ జేరిరి. కలకత్తా పురమంతయు ఇచ్ఛికభటమయమైనది. ప్రభుత్వపు అధికారులు కలవరపోయిరి. కలకత్తా గవర్నరు రోనాల్డ్షే ప్రభువు తహతహపడెను. ఇక నాలస్యము

చేయరాదనుకొనెను. వెంటనే గూఢచారులగు పోలీసులకు తన ఉద్దేశమును దెలిపెను. వారు చిత్తరంజనుని వెన్నంట మొదలిడిరి. దాసు ప్రభుత్వముతో మల్లచరచుచున్నాఁడని గవర్నరుకు దెలిపిరి. గవర్నరు కుపితుఁడయ్యెను. దాసును నిర్బంధింప నాజ్ఞనొసంగెను. పరమ భాగవతుని దేశసేవాపరాయణుని, ప్రజోపకారిని, ఆత్మత్యాగిని, సర్వత్యాగిని, 1922సం. డిసంబరు 10-వ తేదినాఁడు నిర్బంధించిరి పోలీసులు. 6నెలలు విడిశిక్షను విధించిరి. మాజిస్ట్రేటు తన్నుపట్టుకొనగానే భారతీయులకు దాసు ఈ క్రింది సందేశమును పంపెను.—

## ప్రజలకు సందేశము.

"ఓ భారతపుత్రులారా! ఇది నాకడపటి సందేశము. విజయము దృష్టిగోచరమగుచున్నది. కష్టము నోర్చుటవలన దానినిమీరు పొందగోరుదు రేని అది మీకు సిద్ధించును. మీరు మాతృభూమిపక్షమున నిలువ రేని నిరంకుశాధికారులపక్షముననే నిలుచువా రగుదురు.

విద్యార్థులారా! భరతఖండమునకు మీరు మూలాధారులైయున్నారు. భారతముయొక్క ఆశయము కీర్తి మీపై నాధారపడియున్నది. రెండున్ను కూడినవాల్లగునని తెలిసికొనుటయే నిజమగు విద్య

కానేరదు. మనకందఱకు మాతయగు భారతమున కుచేయు సేవయే నిజమగువిద్య. ఇప్పట్లో దీనికి అవకాశము మెండు. ఈపొత్తుతల్లి సందేశమునంపి నప్పుడు దీనికి ఎవ్వరు సంసిద్ధు లయ్యెదరు?

ఓమితవాదమిత్రులారా! ప్రపంచచరిత్రమును ప్రారంభమునందుండి సింహావలోకన మొనరింపుఁడు. మీరనుసరించిన మార్గముగుండా ఏజాతి యైనను గొంత స్వాతంత్ర్యమునైన బడసినదా? దేశమున గల్గియుండు వేదన మిమ్మును చలింపచేసినట్లు అగు పడదు. ఈవేదన నిరంకుశాధికారవర్గముతో కలిగిన సంఘర్షణమే కారణము గలిగియున్నది. ఇట్టి సంఘ ర్షణములవలననే ప్రపంచమున జాతు లుత్పన్నము లైనవని చరిత్ర ఘోషించుచున్నది. శాంతము నణుమాత్రమును చెదరనీయక ధైర్యస్థైర్యసా హసములతో మీరిప్పు డా వేదన ననుభవింపవలెను. మీరు దౌర్జన్యవిరహితపథమున మెలగునంతకాల మును నిరంకుశాధికారుల అక్రమమున నుంచగలు గుదురు. మీకు గాంధిమహాత్ముఁడు ఏర్పఱచిన హింసారాహిత్యమగు శాంతయుతపథమును మీర ణుమాత్రము దాటినను మీరు నిరంకుశాధికారుల కోడిపోయెదరు. స్వరాజ్యము భాగభాగములుగను

వాయిదాలమీదను రానేరదు. అట్టిది మన కక్కఱ లేదు సంపూర్ణమైన స్వరాజ్యమే మనఆశయము. దానికొఱకై మనము పోరాడుచున్నాము. దానిని పొందుటయా? వదలుటయా? నిర్ధారణ చేయవలయును."

వీరిని నిర్బంధించగానే కలకత్తా పౌరస్త్రీలు ఖద్దరుబట్టలనమ్ముటకును, విదేశవస్త్రములను కొనకుండ చేయుటకై యత్నములు సాగించిరి. అందుకు చిత్తరంజనుని భార్య వాసంతిదేవియు; ఊర్మిళాదేవి, సునీతిదేవియును మువ్వురును బహిరంగముగాఉద్యమమును కలకత్తాలో ప్రబలపఱచుటకు యత్నములు చేయగానే పోలీసులు వారిని స్వైరము నిర్బంధమున నుంచిరి. కాని, వెంటనే వదలిరి. అయితే పట్టుబడగానే వారుకలకత్తా సాధ్వీమణుల కిట్లు సందేశమంపిరి —

సాధ్వీమణులకు సందేశము.

"మేము పట్టుబడుటకు సిద్ధమయ్యే బయలుదేరితిమి. మాబిడ్డలు దేశయువకులు దేశసేవాపరాయణత్వమున కారాగారమున బంధింపఁబడుచుండ వారి తల్లులమగు మాకు మాయింట్లలో నుండుటపెనుమంటయందు వైచినట్లైనది. మాసోదరీమణులగు

మీరు మిగిలిన పనిని కొనసాగించవలయును. మీ స్థానములు సైతము కారాగారములలో మావంటి మీసోదరీలకును, సోదరులకును ప్రక్కనసే అమర్చఁబడియున్నవని మరవకుఁడు. బానిస దేశములో స్వేచ్ఛానిరోధమును బొందుటకన్న నిజమగు కారాగారబద్ధులగుటయే గౌరవము. ప్రభుత్వ విద్యాలయములలో విద్యార్థులు చేరక వదలి స్వాతంత్ర్యసంరంభమునకు పూను కొనవలయును ఇదియే మావిన్నపము. ఈసంరంభమున జయించిన స్వరాజ్యప్రాప్తి సిద్ధము. లేదా, ఈ దేహములను ఈసమరములో అర్పించుట సిద్ధము. రెండును దివ్యములే మాకు. ఈ బానిసతన మిక కూడదు. చావో, బ్రతుకో తేలవలయును. పోలీసులు తమపనులకు రాజీనామాల నియ్యవలయునని మేము కోరెదము. ఈపాడు నిర్బంధములను తమ దేశ సేవాపరాయణుల విషయములో ప్రయోగించి జీవించుటకన్న అన్నములేక మాడిచచ్చుట శ్రేయస్కరము అని వారు గుర్తింతురు గాక!"

ఇట్లు దేశబంధువై చిత్తరజనుఁడు వంగ దేశమున సర్వాజ్యాందోళనావిషయమున విద్యార్థులను, స్త్రీలను, పిల్లలను, ప్రజలను ఉన్ముఖులుగ గావించెను. గాంధిమహాత్ముని పద్ధతిని మీరక అసహాయోద్యమ

మును ఖద్దరుప్రచారమును వెల్లివిరియునట్లుగఁ జేసెను. వంగదేశమంతయు నీమహాత్యాగికి అనుచరులైరి. కావున ఈతనిని నిరంకుశాధికారవర్గమువారు శిక్షింప యత్నించి యేదో నేరము మోపి విచారణకు దెచ్చిరి. విచారణను ఆపి రిమాండునందు కొంతకాల ముంచి యే నేరమును మోపి శిక్ష వేయవలయునా యని యాలోచించి పోలీసు లొక సెక్షను క్రింద నేరస్థాపన జేసిరి. అందఱను విడిపింపఁగల శక్తిగల దాసు తనపై తెచ్చిన నేరమునందు తన్ను సమర్థించుకొనువాదమునకే బూనుకొనలేదు. స్టేటుమెంటు నొకదాని నిచ్చెను. మాజస్ట్రేటు శిక్షించవలయునను పట్టుదలతో నుండినందున శిక్ష వేసెను. ఆసంవత్సరమే అన్నిరాష్ట్రములవారును దాసును కాంగ్రెసు అధ్యక్షునిగా నెన్నుకొనియుండిరి. డిసంబరు 10-వ తేది నిర్బంధింపఁబడినవాఁ డెట్లును కాంగ్రెసు అధ్యక్షపదవికిగాను విడుదల బొందలేదు. ఆసంవత్సరములో కాంగ్రెసు మహాసభాధ్యక్షుఁడు లేకయే సభ జరుపఁబడెను. అట్టిసభ యిదివరకు భారతదేశమున జరుపఁబడలేదు. మహాత్ముఁ డప్పటివరకు నిర్బంధింపఁబడలేదు. కాఁబట్టి ఆసంవత్సరపు అధ్యక్షవిరహితసభను మిక్కిలి నేర్పుతో జరపెను. వెంటనే మహాత్ముఁడుకూడ నిర్బంధింపఁబడెను. దేశ

నాయకు లనేకులు కారాగృహబంధితులైరి. 1922వ సం॥ డిసంబరు మాసమున గయలో కాంగ్రెసుమహాసభ జరిగెను. ఈసభనాటికి కొన్ని నెలలకుమునుపే మోతీలాల్ నెహ్రూగారు, చిత్తరంజనదాసు మొదలగు ఉత్తరదేశనాయకులును ఆంధ్రనాయకులనేకులును విడుదలలను బొందిరి.

శ్రీయుత దేశబంధు చిత్తరంజనదాసు చెఱసాల నుండి విడువఁబడినపుడు కాంగ్రెసు పరిస్థితులు మహాత్ముఁడు కాంగ్రెసునకు నాయకుడుగ నుండినట్టి స్థితిలో లేవు. ఈపరిస్థితులు కాంగ్రెసులో మారినవే కాక దేశములోకూడ మారినవి. దేశములో నసహాయోద్యమము నందలి యనురాగము ప్రజలలో క్షీణించెను. ప్రజలు పన్నులుచెల్లింపక దౌర్జన్యరాహిత్యముగ సర్కారుతోఁ బోరాడఁగలరా యను విషయమును దెలిసికొనుటకు దేశమం దంతటను కాంగ్రెసునాయకులు పర్యటనము సలిపిరి. ఈసంఘములో నార్గురునాయకులును ప్రజలలో నుద్రేకము క్షీణించినదని యభిప్రాయపడిరి గాని యాయుద్రేకము నెట్లుద్ధరించుట? యనుమార్గములో మాత్రము భిన్నభావములను తెలిపిరి. హాకీం అజ్మాల్ ఖాను, పండిత మోతీలాల్ నెహ్రూ, వి. జే. పటేల్ గారలు "శాసనసభలు చాల యకృత్యములఁ జేయుచున్న

వనియు, నాశాసనసభలలో కాంగ్రెసుపక్షపువారు ప్రవేశించి వానిని తుదముట్టించినయెడల, దొరతన మువారి ప్రజాపరిపాలనను నామమునకుండు నిరంకుశాధికార మడుగారి పోవుననియు విదేశీయులకు సైతము ఇండియా దొరతనమువారు చేయు కార్యములయందు ఇండియా ప్రజలకు సుముఖత్వము లేదనియుఁ జక్కఁగ నెఱుంగుదురు. ఈవిధమున భారతప్రజల కొకవిధమైన ప్రోత్సాహము కలిగినచో మరల నసహాయోద్యమ మభివృద్ధిఁ జెందఁగలుగును" అని యభిప్రాయఁబడిరి. శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులు, ఎస్. కస్తూరి రంగయ్యంగారు, డాక్టర్: ఎం. ఏ. అన్సారీగారలు గాంధిమహాత్ముని యభిప్రాయములనే మనము కొనసాగించుకొనవలయుననియు,బర్డోలి నిర్మాణకార్యక్రమము నవలంబింపవలయు ననియు తీర్మానమునకు వచ్చిరి. దేశబంధు చిత్తరంజనదాసు పరిస్థితు లన్నియుఁ జక్కఁగ బరిశీలించి కాలమునకుఁ దగినమార్పులు లేకున్నచో నే దేశమును క్షేమపడదనియు నేయుద్యమమును జయమంద లేదనియుఁ దెలిసికొనెను. మహాత్ముఁడు చెఱసాలనుండి విడుదలఁ జేయఁబడిన నాతఁడును తనవిధానము మార్చునని దృఢముగ నమ్మెను.

కాని, యీతఁడు జరుగఁబోవు గయా కాంగ్రెసు తీర్మానమునకు వేచియుండెను.

గయాకాంగ్రెసు.

జనులెల్లరు దేశబంధువుచేసిన త్యాగమునకును దేశసేవకును మెచ్చి యీతని నేకగ్రీవముగ దేశీయ మహాజనసభ కధ్యక్షుఁడుగ నెన్నుకొనిరి. చిత్తరంజనుఁడు కాంగ్రెసులోఁ దనయభిప్రాయములన్నియు వెల్లడిపరచెను. అచ్చటి మహాసదులెల్లగు నాలోచించిరి; కాని దేశబంధుని యభిప్రాయమును రాజగోపాలాచార్యులు ప్రతిఘటించి యది మహాత్ముని యభిప్రాయమునకు ప్రత్యక్షవిరోధమని చెప్పినందు వలనను కాంగ్రెసు అధికసంఖ్యాకులు రాజగోపాలాచారిగారి పద్ధతి ననలంబించినందునను దాసుగారి శాసనసభాప్రవేశ భావము నెగ్గకపోయెను. చిత్తరంజనుఁడు అపజయములకు వెఱచువాఁడు కాఁడు. అపజయ మాతఁ డెప్పుడు చెందునో అప్పుడే యాతని యద్భుతశక్తి ప్రజ్వరిల్లును. కొంచెమైనను వెనుదీయక మనమున కొంతయైనను కుందక దేశబంధువు తనకార్యమును బూనెను. కాంగ్రెసు విధానమున కేలాటి సంబంధమును లేక తనకక్షవారి నందఱ నొక్కటిగఁ జేర్చి స్వరాజ్యకక్ష యని తత్క్షణమే యేర్పాటుఁ జేసెను. ఈకక్షలో భారత

దేశములోని మహనీయు లనేకులు చేరిరి. బొంబా యినగరములో వీ. జే. పటేలుగారును, పూనాలో కేల్కారు, అలహాబాదులో పండితమోతీలాలు నెహూ్రుగారును, తమిళనాడున శ్రీమాన్ ఏ. రంగ స్వామయ్యంగారు, ఎస్. సత్యమూర్తిగారు, ఆంధ్ర దేశనాయకులలో ప్రసిద్ధిఁగాంచిన బారిస్టర్: ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వి. యల్. శాస్త్రిగారు, బా రిస్టర్: కందుల వీరరాఘవస్వామిగారు మనస్ఫూ ర్తిగ నీయుద్యమమును కొనసాగించవలయు నతి దృఢముగఁ దీర్మానించుకొనిరి.

మొదటిరెండు నెలలు వీరు చాలప్రోత్సాహ ముతోఁ బనిచేయుటనుఁ జూచి కాంగ్రెసులో భిన్న భావము లుండఁగూడదనియు నటులుండిన దేశము నకు క్షేమములేదనియు నొకవిధమైనసంధి నొనఁ గూర్చవలయునని కొందఱు నాయకు లభిప్రాయ పడి మొట్టమొదట ఫిబ్రవరినెలలో కాంగ్రెసు కార్య నిర్వాహక సభయందు రాజీతీర్మానమును దెచ్చిరి. దేశబంధు తనసహజభావముతో సంధికొప్పుకొనెను. కాని, రాజగోపాలాచార్యులవారి మొండి పట్టుదల వలన నీతీర్మానము కాంగ్రెసు అంగీకరింపలేదు. దేశ బంధువు రాజీ కుదురవలెనని యపేక్షించినవారిలో నొక్కఁడుకాఁడు. కావున రాజీకై యాతఁడు వేచి

యుండలేదు. తనకార్యమును వంచనలేక నెఱవే ర్చుచు హిందూ దేశమున పర్యటనమునలుపసాగెను. బొంబాయినగరము, పూనానగరములోనగు మహా పట్టణములయందుపన్యాసములు గావించి జనులెల్ల ను వశీకృతులఁ గావించుకొనుచుండెను.

మే నెలలో మరల కాంగ్రెసు కార్యనిర్వాహక సభకూడి స్వరాజ్యకక్షవారు శాసనసభలకు నిలిచి యెడల కాంగ్రెసుపక్షమువా రెవ్వరును కాంగ్రె సుతరఫున వారికి ఓట్లనియ్యఁగూడదని చెప్పరాదని తీర్మానించుకొనిరి. ఈకార్యమువలన కాంగ్రెసువారి కిని స్వరాజ్యకక్షవారికిని మైత్రిగలిగినది. దేశబం ధుని కార్యము కొనసాగుటకు శుభసూచనలు గాడసూపినవి.

దేశబంధువు ఈనెలలోనే మద్రాసురాజధానికి చ్చేసి యందుఁ దనయభిప్రాయములను దెలుపఁ బూనుకొనెను. ఈసందర్భమున కాంగ్రెసువారు భేదభావములు వదలి యాతనిని తమరాజధానికి చ్చేసినందులకు సన్మానపత్రికల నొసగిరి. అతఁడు తమిళ దేశమున ప్రధానపట్టణములయందెల్ల నుప న్యాసములఁ జేసెను. ఎచ్చటఁ జూచినను జనులు తికిటలాడుచు గూడి యాతని యుపన్యాసములను వినుటకు కుతూహలురైరి. చెన్నపురిరాజధానిలో

హిందూదేశములో నెచ్చటను లేని బ్రాహ్మణాబ్రాహ్మణేతర ద్వేషము నీతఁడు తీవ్రముగ ఖండించి బ్రాహ్మణేతర మిత్రులు బ్రాహ్మణులమీఁది ద్వేషమునుబట్టి నిరంకుశాధికారవర్గముతోఁ జేరి యసహాయోద్యమము నణచుటకుఁ జేసిన ప్రయత్నములు కేవలము గర్హ్యములని నుడివెను. తంజాపురము, తిరుచనాపల్లి, తిరునల్వేలి, మధుర, రామనాథపురము లోనగు ద్రవిడదేశములోని పట్టణరాజము లంతట మహానీయుని వాగమృతధార వెల్లి వెరిసినవి.

చెన్నపురిలోని పౌరులెల్లరు నీతనిఁ గొనియాడిరి. అంతటితోఁ దనివినొందక చిత్తరంజనుఁ డాంధ్రదేశములో పర్యటనముసలిపి యచ్చటఁగూడ తన వార్తను దెలుపవలయునని పూనెను. అట్టులే జూన్ నెల యాఖరున తిరుపతి, నెల్లూరు, గుంటూరులో నగుపురములందంతట నత్యద్భుతముగ నుపన్యసించి దేశమునకు స్వరాజ్యావశ్యకత యొక్కయు శాసనసభల వ్యర్థతయొక్కయు భావములను జనులమనంబులలోనెల్ల చక్కగ నంకురింపఁజేసెను. కాకినాడ, రాజమహేంద్రవరము లోనగునాంధ్రనగరములకుఁ బోవుటకు శరీరారోగ్యము తప్పినందువలన, వీలులేకపోయెను.

అంతట దేశబంధువుని 'స్వరాజ్య'వార్త మహో
న్నని యసహాయోద్యమము వలెనే దేశమందంతటను
వ్యాపించెను ప్రజలెల్లరును శాసనసభలకు స్వరా
జ్యకక్షివారినే పంపవలయునని తీర్మానించుకొనిరి.
ఈతీర్మానమునే ప్రజాభిప్రాయములను దెలుపుచు
ఢిల్లీలోఁ జేయఁబడిన అవసరకాంగ్రెసులోఁ గూడ
మౌలానామహమ్మదాలీ నాయకత్వమునుఁ మౌలా
నా అబ్దుల్ కలాంఆజాడ్ గారి యాధిపత్యమునను
శాసనసభలకుఁ బోవువారిని కాంగ్రెస్ అడ్డుపరుపఁ
గూడదనియు, కాంగ్రెసులో నైకమత్యమే ప్రధాన
మనియు దృఢపరచినది. కాంగ్రెసుతీర్మానమునే ప్రజ
లొప్పుకొనిరి. ఇది స్వరాజ్యకక్షివారికిఁ గలిగిన
జయమే సూచించుచున్నది. అఖిలభారత శాసన
సభాసభ్యులలో నొకస్వరాజ్యకక్షివారుమాత్రమే
౭౦సభ్యులున్నారనుట మనమెల్లరును గర్వపడవలసిన
విషయమే.

ఇతరరాష్ట్రములందేగాక వంగరాష్ట్రమునకూడ
స్వరాజ్యకక్షివారనేకులు శాసనసభ్యులైనమీదట
గవర్నరు లిటన్ ప్రభువు శ్రీదాసుగారి నాహ్వానించి
మంత్రివర్గమును నిర్మించుమని కోరెను. ఆమీద తన
కక్షివారిని సమావేశపఱచి వారుకోరిన షరత్తుల
నొప్పుకొన్నచో మంత్రిపదవుల స్వీకరింతురని చెప్పి